# ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1974 దీపావళి కథల పోటీ - బ్యాలట్ !

## నాలుగు కథలు : మొత్తం రూ. 5000 ల బహుమతులు!

ఏటా నిర్వహిస్తున్నట్లే యీ ఏడాది కూడా ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచిక ప్రత్యేక ఆకర్షణగా 'కథల' పోటీ నిర్వహిస్తున్నాము.

**ముగింపు తేదీ : 20-9-1974**

ఐతే యీసారి "కథల" సంఖ్య తగ్గించి బహుమతుల మొత్తాన్ని పెంచాము. పోటీకివచ్చిన కథలలో 'సంపాదకుని ఎన్నికలో' అత్యుత్తమంగా తేలిన నాలుగు కథలకు ఒక్కొక్క కథకి రు. 750 చొప్పున పారితోషికం అందజేస్తాము. ఇదిగాక యీ నాలుగు కథలను ప్రచురించి వాటిపై పాఠకుల అభిప్రాయాన్ని బ్యాలట్ పత్రరూపంలో తీసుకోదలిచాము.

బ్యాలట్‌లో ప్రథమ స్థానాన్ని పొందిన కథకు అదనపు బహుమతి రు 650 యిస్తాము. ద్వితీయ స్థానం, తృతీయ స్థానం పొందిన కథలకు ఆ క్రమంలో రు 550 రు. 450లను అదనపు బహుమతులుగా పంపుతాము చివరి కథకు రు 350లు అదనపు బహుమతిగా పంపుతాము అంటే దీపావళి కథలు నాలుగింటికి రు. 1400లు రు. 1300లు. రు. 1200లు, రు. 1100లు ఆ వరుస లో బహుమతులు అందుతాయన్నమాట

### * నిబంధనలు *

- ★ సంపాదకుని ఎన్నికలో నెగ్గిన నాలుగు కథలను దీపావళి సంచికలో; ఆ తరువాతి సంచికలలో అప్పటి వీలును బట్టి ప్రచురిస్తాము. "ఈసారి విజేతల పేర్లు, వివరాలుకూడా బ్యాలట్ ఫలితాలతో పాటే ప్రకటించాలని నిర్ణయించాము" ముందుగా కథలతో పాటు ప్రకటించము. కథల ఎన్నికలో పాఠకుల సౌలభ్యంకోసం యీ మార్పు చేస్తున్నాము.
- ★ రచన తెనుగువారి సామాజిక జీవితానికి సంబంధించినది అయి వుండాలి తేటతెనుగు వ్యావహారిక భాషలోనే వ్రాయడం అవసరం.
- ★ రచన 12 అరఠావులకు మించరాదు లోగడ అచ్చుఅయిన ప్రసారమైన కథలను పంపరాదు అనువాదం, అనుకరణ కారాదు. ఈ మేరకు రచయిత హామీ పత్రం కథతోపాటే జతపరచి మరీ పంపితీరాలి. రచనలపై పేచీలు వస్తే బాధ్యత రచయితలదేనన్న మాట గుర్తుంచుకోవాలి
- ★ 1974 దీపావళి కథలపోటీ : సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3. అన్న చిరునామా కవరుపై స్పష్టంగా వ్రాయాలి.
- ★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైన వాటి ప్రచురణకు అంగీకరించాలి. తమ ఫొటో, వివరాలు పత్రికలో పడటం యిష్టంలేని రచయితలు పోటీకి కథలు పంపకపోవటం మంచిది.
- ★ దీపావళి పోటీకి వచ్చిన రచనలు త్రిప్పి పంపలేము. కనుక స్టాంపులు, స్వంత కవర్‌లు మొదలైనవి కథలతోపాటు పెట్టకూడదు.
- ★ పోటీకి వచ్చిన కొన్ని కథలను వాటి స్థాయిని బట్టి మామూలు ప్రచురణకు స్వీకరించే అవకాశముంది. ఆ విధంగా ఎన్నికయిన కథకులకు ఆ విషయం దీపావళి తరువాతి నాలుగు వారాలలోగా తెలియ జేయటానికి ప్రయత్నిస్తాము.

—సం.



దేవి ఆర్ట్సు వారి

# ధనవంతులు గుణవంతులు

నిర్మాత: వడ్డే పూర్ణచంద్రరావు
దర్శకత్వం: కె. ఎస్. ప్రసాదరావు M.A.
నిర్వహణ: వడ్డే నాగేశ్వరరావు
సంగీతం: పెండ్యాల











ఆంధ్ర: కృష్ణ, పశ్చిమగోదావరి, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు అన్నపూర్ణా డిస్ట్రిబ్యూటర్సు
శ్రీకాకుళం, వైజాగ్ జిల్లాలకు: శ్రీపద్మా పిక్చర్సు, వైజాగ్

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకులు
(1938 - 1972)
శుక్రవారం : 13-9-'74
ఆనందనామసం. అధిక భాద్రపదమాస శు. ద్వాదశి
సంపుటము : 67 సంచిక 55
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3.
సంవత్సర చందా – రు. 31-20 పై.
ఆరుమాసాల చందా – రు. 15-60 పై.
విడి ప్రతి వెల 55 పైసలు


## విషయానుక్రమణిక





పై వారమే
కొత్త సీరియల్



కె. ప్రత్యగాత్మ సమర్పించు

సత్యా ఎంటర్ ప్రైజెస్ వారి

# ఆడపిల్లల తండ్రి

కథ నిర్మాత దర్శకుడు కె వాసు సంగీతం టి చలపతిరావు

సోల్ డిస్ట్రిబ్యూటర్సు
అనిల్ ప్రభాస్ ఎంటర్ ప్రైజెసు
సర్కారు జిల్లాలకు మాత్రం
విడుదల శ్రీ ఫిలింస్

Veekay

## —లోకం పోకడ ————————— ఊమెన్—




చిట్ట మధ్యాహ్నం.

ఎండ నిప్పులు చెరుగుతూ వుంది.

కరెంట్ కొరతవల్ల ఇంట్లో ఫ్యాన్లు ఆడటం లేదు.

ఇంట్లో పడుకుంటే వుక్క. వరండాలో పడుకుంటే వడగాలి బాచి చెంప మీద కొట్టి నట్లు తగుల్తోంది.

నిద్రపట్టక దొర్లుతూ వున్నాను.

ఇంతలో కారు హారన్. గేటుతీసిన చప్పుడు వినిపించాయి.

మా మాలతి అక్కయ్య వచ్చింది.

"ఏమే సెలవలా ?" అంది.

ఔను అన్నట్లు తలూపాను.

"పరీక్షలు బాగా వ్రాశావా ?"

"ఆఁ.. ఒక్కదానివే వచ్చావేఁ.. బావ..."

"ఈ రాత్రికి మా ఫ్రెండ్ పెళ్లి వుంది ఇక్కడ బావగారికి వీలు పడ్లేదు" అంది.

ఇంతలోకే మా అమ్మ, తమ్ముళ్లుఅక్కను చుట్టుకున్నారు.

అక్కనుచూడగానే మా అమ్మమ్మజ్ఞాపకం వస్తుంది నాకు.

మాలతి పెళ్లయి పదేళ్లు దాటింది. అయినా నాకింకా బాగా జ్ఞాపకం వుంది ఆ రోజు.

దాని పెళ్లికి నాకు పదేళ్లు.

పెళ్లికి కుట్టించిన నారింజ రంగు పట్టు లంగా, జాకెట్టు కట్టుకున్నాను. అవి నాకెంతో నప్పాయని అందరూ మెచ్చుకున్నారు.

పెళ్లి తెల్లవారు జామున.

ఉదయం నుంచే అంతా హడావుడిగా వున్నారు. మా నాన్నయితే మరీను. పని చేసే వాళ్లమీద కేకలేస్తూ, భూమ్మీద నిలవడం లేదు

ఎక్కడ పనులక్కడే తగలడ్డాయని మా అమ్మ తెగ విసుక్కుంటూ వుంది. నేను మాత్రం బట్టలు ఎక్కడ నలుగుతాయోనని, మా అక్కయ్యదగ్గరే కూర్చున్నాను అక్కయ్య ఫ్రెండ్సు చెప్పకునే మాటలు వింటూవున్నాను.

బైటికెళ్తే చుట్టాలు ఏదోకవని చెప్పి చంపుతున్నారు నిన్నటి నుంచీ చూస్తున్నా గదా వీళ్ల వరస.

"చిన్నమ్మాయ్ ! కొంచెం అగ్గి పెట్టె తెచ్చి పెట్టమ్మా !" అంటాడొక ముసలాయన మూరెడుచుట్ట నోట్లో పెట్టుకుని, ఈచుట్ట తాగేవాళ్లంటే నాకు పరమ అసహ్యం.

"గొంతు ఆర్చుకు పోతుండే తల్లీ. కాసిని ఐస్ పెట్టెలో నీళ్లు పొయ్యమ్మా! చచ్చి నీ కడుపున పుడతాను" అంటుంది ఎండకి తాపంతో తపిస్తున్న ముసలమ్మ. అసలీ ముసలోళ్లు పెళ్లిళ్లకి రాకపోతేనేం. అయినా వాళ్లింట్లో రోజూ ఐస్ నీళ్లే తాగుతుందా?

"బంతిలో వెయ్యడానికి ఏం చేశారు? "తల క్రింద దిండు లేకపోతే నిద్రపట్టి చావదు లోపల ఒకదిండు తెచ్చిపెట్టమ్మా!"

"వంటగదిలో వేణ్ణీళ్లున్నాయా?"

"ఆకలి మండి పోతోంది ఇంత వరకూ టిఫిన్ కు గతిలేదు." ఎవర్నేమనేట్లు? అందరూ చుట్టాలే. దయ్యాల్లా పట్టుకున్నారు.

అమ్మమ్మకి తోడు నన్ను వెళ్లమన్నారు నాన్నగారు. నాకైతే ఇష్టంలేదు. అసలే ఎండ మండి పోతోంది. అమ్మమ్మ సంగతి నాకు బాగా తెలుసు. పీనాసి. ఐతే నాన్నగారు వెళ్ల మన్నప్పుడు వెళ్లకపోతే, అసలే చిరాకులో వున్నారు, వీపు చీరుకుపోతుందో ఏమోనని అయిష్టంగానే 'వూఁ' అన్నాను.

# మాలతి పెళ్ళి – మల్లెపూలు

వాణిశ్రీ



లడ్లా? అరిసెలా? ఏదీ ఒకటి తెచ్చిపెట్టు" అంటాడొక తిండిపోతు.

"నా లుంగి ఎక్కడుందో? ఏమో! గంట నుంచీ కన్పించడం లేదు. ఇదుగో నేవ్... నా లుంగి చూశావా? చారలు... చారలుంటాయి"

మా అక్కయ్య పెళ్లయ్యేలోగా, ముందు నా పెళ్లయ్యేట్లుందని వినుక్కుంటున్నాను. సరిగ్గా అప్పుడే మా అమ్మమ్మ గుంటూరు ప్రయాణం అయ్యింది.

అక్కయ్యకు చేయించిన నెక్లెస్, ఇంకా ఏవో చిల్లర సామాన్లు తేవడానికి.

నా నారింజ రంగు పట్టులంగా నలిగి పోతుందేమోనని బాధ, అప్పుడే భోజనం చెయ్యడం, తర్వాత చాటుగా రెండు లడ్డూలు కుక్కడం వల్ల ఆయాసం, దారిలో రెండే ళ్లకి వస్తుందేమో ఎలాగా? అనే భయం.

## మాలతి పెళ్ళి — మల్లెపూలు

"నడవ్వేమే..." అని ముందుకు నెట్టింది అమ్మమ్మ.

"వచ్చేటప్పుడు రెండు శేర్లు మల్లెపూలు మర్చిపోకే అమ్మా! మల్లెపూలంటే మాలతికి ప్రాణం—" అంది అమ్మ.

"అలాగేలేవే... ఎన్నిసార్లు చెప్తావూ..." అని విసుక్కుంది అమ్మమ్మ.

గుంటూరు చేరేటప్పటికి నాలుగు దాటింది.

ఎండ ఎడా పెడా వాయించేస్తోంది.

బస్సు ఆగినప్పుడల్లా సోడాలు త్రాగుతున్నా, దాహం తీరటంలేదు.

బస్టాండు నుంచీ బజారు అరమైలు కంటే ఎక్కువే వుంటుంది.

"రిక్షా ఎక్కుదాం." అన్నా.

ఉండి పడింది. "రిక్షానా!... ఏవన్నావూ?...ముసల్దాన్ని నేను నడుస్తుంటే, కుర్ర పిల్లవి నువ్వు నడవలేవా?" అని గద్దించింది.

నేను మొఖం చిన్నబుచ్చుకుని నడక సాగించాను.

దార్లో కూల్ డ్రింక్స్ షాపులు కన్పించాయి షాపునిండా అద్దాలు బిగించి కళ్ళు చెదిరిపోయేట్లున్నాయి.

"అమ్మమ్మా! కూల్ డ్రింక్ తాగుతానే" అన్నా

"వెధవ్వేషాలెయ్యకు" అని కసురుకుంది.

నాకు ఏడుపొకటే తక్కువ. మా నాన్నయితే అడక్కముందే ఐస్ క్రీమ్ ఇప్పించేవారు.

ఇంకొంచెం దూరం పొయ్యాక చెరుకు రసం స్టాల్స్ కన్పించాయి. "ఐస్ కలిపిన చల్లని చెరుకు రసం. గత సంవత్సరం పేరు పొందిన స్టాల్" అని అన్నిటి మీదా వ్రాసి వున్నాయి.

"చెరుకు రసమన్నా ఇప్పించవే..." అన్నా.

"ఛీ...ఛీ...అది త్రాగితే కలరా వస్తుంది. చూడు ఆ ఈగలు..." అంది అమ్మమ్మ.

నిజంగానే చెరుకు రసం తీసే గానగలో ఈగలు గుంపులు, గుంపులు వున్నాయి. ఈ జన్మలో చెరుకు రసం త్రాగ్గూడదురా నాయనా! అనుకున్నాను.

ఈసారి అమ్మమ్మకి దాహం అయినట్లుంది. సోడా త్రాగి నాకూ ఇప్పించింది. వెళ్లడం, వెళ్లడం కంసాలి కొట్టుకే వెళ్లాం.

ఆ కంసాలి అచ్చం సినిమాలో రమణారెడ్డి

లాగే వున్నాడు. వంట్లో చెంచా మాంసంలేదు ఈఎండల్లో ఎట్లా బ్రతుకు తున్నాడోఏమో!

మమ్మల్ని చూసీ, చూడగానే "అయి పోయింది, అయిపోయింది..." అన్నాడు.

మా అమ్మమ్మకి వాడు బాగా తెలిసిన వాడిలాగే వున్నాడు. తిట్లు లంకించుకుంది "ఏమిట్రా అయిపోయింది నీ దేవసం ఇయ్యాలే పెళ్లి." అంది.

"అయిపోయింది." అన్నాడు మళ్లీ.

"పిచ్చి చచ్చినోడా! నువ్వెప్పుడు సరిగా అచ్చేడిశావు గనక" అంది.

'ఒకగంట.' అన్నాడు పళ్లన్నీబైటపెట్టి

"తొందరగా కానీ. బజారెళ్లొస్తా రావే..." అని రెక్కుచ్చుకుని లాగింది.

మా అమ్మమ్మ పీనాసి మనిషని నాకు తెలుసును కాని మరీ జిడ్డు అని అర్థమై పోయింది. ఏ వస్తువయినా వాళ్లు చెప్పిన దానికి సరిగ్గా సగానికి అడుగుతుంది వాళ్లేమో నివ్వెరపోయి 'ఇవ్వం' అనేస్తారు ఆ వస్తువుకోసం పదికొట్లు తిప్పుతుంది ఈవిడ బేరం చూసి, చూసి, తలనొప్పి వచ్చింది.

కంసాలి నెక్లెస్ ఇచ్చేసరికి ఆరు దాటింది.

పోనీ ఇప్పుడైనా రిక్షా ఎక్కిస్తుందేమో అని ఆశపడ్డాను.

ఆవిడగారు రిక్షా పిలిచేసూచనలేకన్పించలా.

ఖాళీ రిక్షాలు వచ్చినప్పుడు ఆశగా, అమ్మమ్మవంక చూసేదాన్ని. ఆవిడ ఎక్కడో చూస్తూ నడిచేది.

పూలకొట్లు చూడగానే, నాకు మల్లిపూలు జ్ఞాపకం వచ్చాయి.

"అమమ్మా! మల్లెపూలే! అమ్మ రెండుశేర్లు తెమ్మందిగా" అన్నాను.

అమ్మమ్మ మల్లెపూల కొట్లవంక చూసింది. "శేరు రూపాయి. శేరు రూపాయి.. రండి... రండి..." అని అరుస్తున్నారు. వాళ్లముందు రాసులుపోసి వున్నాయి పూలు.

"బస్టాండ్‌లో వుంటాయిగదే. ఇక్కడ్నుంచే మోతబరువెందుకు?" అంది.

నీరసంతో, చచ్చిచెడి బస్టాండ్ చేరాను.

బుట్టల్లో పూలు పెట్టుకుని మాలలు కట్టుకుంటూ "మూర పదిపైసలు...మూర పదిపైసలు..." అంటూ అరుస్తున్నారు.

నేను జ్ఞాపకం చెయ్యకముందే "శేరెంతరా అబ్బాయ్!" అనడిగింది.

"శేరుతెక్కనమేం అమ్మం" అన్నాడు.వాడు

"ఏం?"



భారతదేశపు ఐదవ రాష్ట్రపతిగా శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ఆగస్టు 24వ రాష్ట్రపతి భవన్ దర్బార్ హాలులో ప్రమాణస్వీకారం చేస్తున్న దృశ్యం.

"గిట్టుబాటు కాదు."

"అవసరంలా అబ్బీ. ఎట్లాగో రెండు శేర్లియ్యి..." అంది అమ్మమ్మనీరుకారిపోతూ.

"శేరు మూడు రూపాయిలు." అన్నాడు పూలబ్బాయి.

నాకు నవ్వొచ్చింది. పక, పక నవ్వేశాను.

అమ్మమ్మ చుర్రుమని చూసింది. నేను నోరు మూసేశాను.

"బజార్లో రూపాయేగదరా అబ్బీ!" అంది అమ్మమ్మ.

"అక్కడే కొనుక్కోండి పోయి..." అన్నాడు వాడు హేళనగా.

అమ్మమ్మకి కోపం వస్తూవుంది.

ఇంతలో మావూరు వెళ్లేబస్సు వచ్చిప్లాట్ ఫారంమీద నిల్చుంది. జనం ఎక్కుతున్నారు.

'అమ్మమ్మా! బస్సువచ్చేసిందే!' అన్నాను.

"వెధవ బస్సు. వస్తేవచ్చిందిలే." అని విసుక్కుంది.

నేను బిక్కమొఖం వేసుకుంటూ నిల్చుండి పోయాను. అందరూ బస్సెక్కుతున్నారు. సీట్లుంటాయో లేదో? తీరా సీటు లేదంటే నిల్చోని చావాలి.

"పద బజారు కెళ్లి కొనుక్కుందాం. మరీ ఇంత విడ్డూరమా? శేరుకి రెండురూపాయిలు ఎక్కువా? ఇంత అన్యాయంటరా అబ్బీ!..." అని గొణుక్కుంటూ దారి తీసింది

"మళ్లీ అంతదూరం నడవాలా?" అన్నాను ఏడుపు మొఖంతో.

"ఎంత దూరమే పిచ్చి కొయ్యా! ఈ దూరం నడవ లేవూ... నీ అంతున్నప్పుడు పదిమైళ్లు నడిచేదాన్ని. మంచి దానివికదూ! నీకు చెరుకు రసం ఇప్పిస్తా!..." అంది

నాకు ఈగలు జ్ఞాపకం వొచ్చి "ఛీ, నా కొద్దు. ఈగలు" అన్నాను.

"ఈగ లెక్కడే వడ పోస్తారుగా" అంది

"నా కొద్దు."

"పోన్లే..."

"నాకు ఐస్ క్రీమ్ కావాలి."

విని, విననట్లు "వూఁ" అనిమాత్రం అంది

కాళ్లీడ్చుకుంటూ పూలకొట్ల దగ్గరికి వెళ్లేసరికి మా వూరి శివాలయం పూజారి రాంబొట్లు కన్పించాడు.

ఆయనతో అరగంటసేపు మాట్లాడుతూ కూర్చుంది.

నాకు కాళ్లు పీక్కుపోయి, రోడ్డుప్రక్కన పేవ్‌మెంట్ మీద చతికిలబడ్డాను.

"ఏడింటికే ఆఖరి బస్సు, ఆ తర్వాత బస్సు లేదు..." అంటున్న రాంబొట్లు మాటలు నాకు వినిపించాయి.

అప్పటికి బాగా చీకటి పడిపోయింది టైమెంతయిందో తెలియదు.

"పదవేవ్ ఏడయిందట..." అని గావుకేక పెట్టింది.

**పాఠ్య పుస్తకాల్లో వింతలు.**

ప్రభుత్వం అచ్చు వేస్తున్న పాఠ్య పుస్తకాల ఖరీదు చాలా ఎక్కువ వుండడమేగాక, అందులో విషయాలను విషమంగా రాస్తున్నారని రాజ్యసభలో లోకనాద్ మిశ్రా అన్నారట. కాశ్మీరు సోవియెట్ యూనియన్‌కు చేరినది అనీ, ఆకాశము నల్లగా వుండును అనీ మధ్యప్రదేశ్‌కు చెందిన కొన్ని ప్రభుత్వ పాఠ్యపుస్తకాలలో వున్నదని ఆయన అన్నారట.

**లక్షలు డెమరేజీయా!**

ఉత్తరప్రదేశ్ విద్యుచ్ఛక్తి బోర్డుకు చెందిన ఎలక్ట్రికల్ పరికరాలు అనేక రైల్వే స్టేషనులలో చాలాకాలంగా అతీగతీలేకుండా పడున్నాయట. ఈ పరికరాల మీద రైల్వే వారికి విద్యుచ్ఛక్తి బోర్డు లక్ష రూపాయలు డెమరేజి (వెంటనే తీసుకొనందుకు ఆ స్థలానికి అద్దెవంటిది) కట్టాలంట. మొత్తం పరికరాల విలువ ఏడుకోట్ల రూపాయలట. ఈ లెక్కనసలు ఆ పరికరాల విలువ దాటిపోదూ?

**దిగంబర మహాసభ డిమాండ్స్!**

ఈ సారి ఒలింపిక్ పందాలలో పాల్గొనే ఆటగాండ్రందరూ దిగంబరులై ఏల పాల్గొనరాదు అని ప్రపంచ దిగంబర మహాసభ చర్చించిందట. ఈ సభకు హాజరైన 22 దేశాల దిగంబరులూ యీ విషయాన్ని ఒప్పుకున్నారట. తమ దేశం పేరు, పతాకం వున్న బాడ్జీలు ఆటగాళ్ళు మెడలో వేసుకోవచ్చని కూడా వారు సూచించారట. గ్రీసులో ఒకానొక రోజుల్లో ఆడిన రీతిగా యీ ఆటలు దిగంబరులై ఆడాల్సిందేనని వారు తీర్మానించారట—ఒలింపిక్కొట్లకెళ్దాం!

**అడ్వకేట్ల ఆడవారినే మోసగించుటా!**

మద్రాసులో 58 ఏళ్ళ సుందరపాండ్యన్‌అనే ఒకాయన కొత్తరకం దొంగతనాలుచేసి చివరికిపట్టుబడిపోయాడట. ఆయనకేవలం అడ్వకేట్సు(లాయర్సు) యిళ్ళకు వారు లేని సమయంలో వెళ్ళి ఆడవారిని పిలిచి, నెయ్యి గాని, వెన్నగానీ కొనమని ఒప్పించి, గిన్నెలు తీసుకుని బండి బయటుంది అన్న వంకతో గిన్నెలు తస్కరించేసేవాడుట. ఈయన్నూ తస్కరింపబడ్డ గిన్నెలనూ పోలీసు పట్టుకుందిట.

**వృద్ధుని విద్యా వ్యాసంగం!**

ప్రొఫెసరు లక్ష్మీరామచంద్ర కులకర్ణి అనే ఆయన ప్రవరసేన మహారాజు రచించిన 'సేతుబంధన' మీద రిసర్చి చేసి 1972 లో నాగపూరు విశ్వవిద్యాలయానికి పంపితే వారాయనకు మొన్ననే పి. హెచ్‌డి యిచ్చారట. ఇప్పుడు కులకర్ణి గారికి 89 ఏళ్లట. "అయితే యేం? వయస్సుకు చదువుకు ఏ విధమైన సంబంధమూ లేదు" అన్నారట ఆయన —హాపునవును.

**చేపల ఉత్పత్తి పెరిగిందా?**

నెల్లూరు జిల్లా సింగపేటకు చెందిన అల్లూరు రామన్న చెరువులో యీ ఏడు రు. 30,035 రూపాయల విలువ చేసే 10834 కిలోల చేపలు దొరికాయట. ఇన్ని చేపలు ఏ ఏడూ, ఏ నాడూ దొరకలేదట. ఈ విషయాన్ని మత్స్య పరిశ్రమ శాఖ అసిస్టెంటు డైరెక్టరు గారన్నారట.

---

ఈ సారి మాత్రం రిక్షా కేకేసింది.

"ముప్పావలా ఇయ్యండి" అన్నాడు రిక్షా అబ్బాయి.

"ఆరణాలిస్తా!" అంది అమ్మమ్మ.

మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

ఇంకో రిక్షావాలా 'రూపాయి'అన్నాడు.

ఆ కోపంలో అమ్మమ్మ వాడిని తిట్టి, శాపనార్థాలుపెట్టి ముప్పావలాకి బేరమాడింది.

నాకు కూల్‌డ్రింక్ ఇప్పించనే లేదు.

త్వరగా పోనివ్వమని రిక్షా అతన్ని తొందర పెట్టింది! తీరా బస్టాండ్‌కి వెళ్తే మా వూరు బస్సు వెళ్ళిపోయింది.

వుసూరు మంటూ అక్కడే చతికిలబడిపోయింది అమ్మమ్మ.

"ఏం జేద్దామే అమ్మాయ్!" అంది తేలు కుట్టిన దొంగలా కూర్చుని.

నేను ఏడుపు మొఖం పెట్టుక్కూర్చున్నాను.

బస్ కాస్తా వెళ్ళిపోయింది.

పదకొండింటికి పెళ్ళి.

అప్పుడే ఏడున్నర దాటిందేమో!

అసలు అక్కయ్య పెళ్ళి చూస్తానో లేదో? అని దిగులు పట్టుకుంది.

అమ్మమ్మ మీద మండిపోయాను.

కాలం గడిచేకొద్దీ నాకు ఆరాటం ఎక్కువయింది.

ఏమీ చేయలేక బావురుమని ఏడ్చాను.

నేను ఏడవడం మొదలుపెట్టేసరికి

## మాలతి పెళ్ళి — మల్లెపూలు

అమ్మమ్మలో కదలిక కలిగింది. మొఖం కాస్త నల్లబడింది.

అక్కడ బస్సు కండక్టర్లలోనూ, బస్సు కూలీలతోనూ మా వూరు బస్సు గురించి మొత్తుకుంది.

టాక్సీలో వెళ్ళమని సలహా చెప్పారు.

బస్టాండ్ నుంచి బైటికొచ్చి టాక్సీని పిలిచింది.

"ముప్ఫై రూపాయి లివ్వండి." అన్నాడు డ్రైవరు.

గుండె ఆగిపోయినదాన్లా "అమ్మో!" అంది.

ఎవర్నడిగినా పాతిక రూపాయిలు తక్కువ చెప్పలేదు.

"ఈ పాటికి పీటల మీద కూర్చుంటారో ఏమో! తొందరగా వెళ్దామే." అన్నాను.

'ఛెయ్' మని ఇంతెత్తు ఎగిరి "ఛా... నోర్మూయ్" అంది.

నాకు కోపం వచ్చి ఏంచెయ్యలేక పెద్దగా ఏడ్చాను.

ఆఖరికి ఇరవై రూపాయిలకు ఒక టాక్సీ కుదిరింది.

కసి కొద్దీ నా రెక్క పట్టుకుని అందులో కూలేసింది అమ్మమ్మ.

రైలింజనంత మోతతో బయల్దేరింది బండి. అది మా వూరు చేరుతుందో లేదోనని అనుమానం వేసింది. ఎక్కడా ఆగకుండా పోతే కొబ్బరికాయ కొడతానని దేవుడికి మొక్కుకున్నాను.

దేవుడికి నా మొర విన్పించినట్లు ఎక్కడా ఆగకుండా మా ఇంటి ముందు ఆగింది టాక్సీ.

అప్పటికే పందిరంతా హడావుడిగా వుంది. భోజనాలు రెండోపంక్తి జరుగుతోంది.

అమ్మ మా కోసమే ఎదురు చూస్తూ వుంది.

"ఇంతసేపున్నారేం?" అంది.

"ఆ వచ్చినాడు నెక్లెస్ ఇస్తేగా?" అని చిన్న అబద్ధం ఆడింది అమ్మమ్మ.

"మల్లెపూలు తెచ్చారా?"

"ఆ..."

అమ్మ పొట్లాం విప్పిచూసి "బాగున్నాయే పెద్ద మొగ్గ. పందిరి మల్లె అనుకుంటాను ఎలా ఇచ్చారు శేరు?" అంది.

"శేరు రూపాయి." అంది అమ్మమ్మ.

"లేదు శేరు పదకొండు." అన్నాను నవ్వుతూ.

అమ్మమ్మ నా వంక పెద్దపులిలా చూసింది. "దాని మొఖం ..." అంటు వెళ్ళిపోయింది లోపలికి.

నేను జరిగిందంతా అమ్మకి చెప్పాను.

అంతా విని అమ్మ విరగబడి నవ్వింది.

ఏ ట్రేడ్‌మార్క్‌లోనైనా

# నమ్మకము

కలగడానికి కారణమేమిటి?

ఉదాహరణకి బట్టలనే తీసుకోండి ఓ పేరు ప్రముఖంగా
కనిపిస్తుంది అదే టెరీన్ ° దీని ప్రసిద్ధి అధికం.
కావడానికి కేవలం అందాలుచిందే ప్రింట్లు కాదు
కారణం దాని ఉత్కృష్టమైన నాణ్యత కూడా
కారణమే నయనాకర్షితాలు దీని డిజైన్లు
అయితే ఇదే ఇంకా ఇంకా కావాలని ప్రతివారినీ
కోరేటట్లు చేసేది దీని అపూర్వమైన నాణ్యతే.

TERENE

® టెరీన్ — కెమికల్స్ [illegible] ఫైబర్స్
ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్

CHAITRA-CARI 25D-TEL

[గతసంచిక తరువాయి]

వారి కొద్ది రోజులుకి మద్రాసు నుంచి కుటుంబంతో సహా వొక పత్రికా విలేఖరి కాశీయాత్రకి వచ్చాడు. మరకతాన్నిపోల్చి పలకరించాడు. మద్రాసు చేరగానేతన పత్రికలో పెద్ద వ్యాసంప్రచురించాడు అందులోను "సుప్రసిద్ధ గాయని నాట్యరాణి అయిన శ్రీమతి మరకతం వొకానొకప్పుడు వేలాది ప్రజను తన కళా నైపుణ్యముతో వుర్రూతలూగించింది అటువంటి ప్రతిభాశాలి అతి దీనావస్థలో కాశీలో తన శేష జీవితంగడుపుతోంది. ఆమె ఆస్థితికి దిగజారిందంటే కళాభిమానులకే కళంకం" అంటూ రాసాడు. ఇంకా యిల్లాగన్నాడు. "త్యాగరాజు మావాడని భుజాలెగురవేసే తెలుగుప్రజ వారింటికి మెట్టివచ్చిన కళామతల్లిని కించపరిచారంటూ" సవాల్ చేసాడు.

తెలుగువాడికి చీమకుట్టినట్లయినా లేదు. అరవప్రజలందరూ చెట్టియార్ని చుట్టుముట్టి "చందాలు కూరుస్తాము గానపీఠం వొకటి నిర్మించి ఆమెను యిక్కడికి తీసుకువద్దా" మంటూ వుత్సాహపూరితులయినారు.

* * *

చెట్టియారుకి వార్ధక్యం వచ్చేసింది. ఆ వ్యాసం చదివి స్నేహితుల వుత్సాహం చూపి కాశీ బయలుదేరి వెళ్ళారు. మరకతం బస కనుక్కోవడానికి శ్రమపడలేదు. విశ్వేశ్వరుని కోవిలకి వెళ్ళే గల్లీలో వొక చిన్నయింటిలోంచి తన కిష్టమైనపాట "...త్యాగరాజా హృదయా పూర్ణాకామా" "నినుబాసి ఎట్లాయుండురు నిర్మలాత్ములో జనులూ" అని సామరాగ కృతి పాడుతోంది. లోపలికి వెళ్ళారు. అక్కడ మరో పదిమందిచేరి పాట వింటున్నారు. భార్యాభర్తలు లాగున్న యిద్దరు వ్యక్తులు మరకతానికి దగ్గర్లో కూర్చునున్నారు. మరకతం కళ్ళుమూసుకొని వుంది. తనో ప్రక్కగా కూర్చున్నారు చెట్టియారు. మరకతం మరో పాట "రామభక్తి సాంబ్రాజ్యం" శుద్ధబంగళా ఎత్తుకొని పాడింది. తరువాత త్యాగరాజ పంచరత్నంలోనిది "దుడుకుగల" గౌళరాగం ఎత్తుకుంది. యేడవ చరణం "చక్కని ముఖకమలంబును నా మదిలో..." అని పాడుతూ కంఠము రుగ్ధమొగా పాడలేక ఆపేసింది. ప్రక్కనున్న వృద్ధజంట "నేదురాంధజముల కోరి పరితాపములచేత గిలి నొంగిలి" అని అచరణమమిగిలిన చరణాలు పాడి పూర్తిచేసారు. మరకతం కనుకొలుకులంట అశ్రుధారలు జారుతుండగాకళ్ళ

మూసుకొని వుంది. కొంతసేపటికి వచ్చినవారు వొక్కరొక్కరే వేచి వెళ్లిపోయారు. ఆ వృద్ధ దంపతులు లేచి యింట్లోకి వెళ్లిపోయారు. తరువాత కొంత సేపటికి మరకతం కళ్లు విప్పి కన్నీరు వొత్తుకుంది. అక్కడే కూర్చునున్న చెట్టియారు "మరకతా" అన్నారు. తన్ని అల్లా పిల్చేవారు వొక్కరే! మరకతం ఒక్క క్షణం తత్తరపాటుతో అతన్నిపోల్చి, పోల్చగానే కాళ్లు కూడదీసుకొని లేచగలిగినంత తొందరగాలేచి తొట్రుపడుతూ "ఎన్‌వర్ వందావి. ఎన్నస్వామి వందావి" అంటూ అతనిపాదాలకి నమస్కరించితూలబోయింది. మరకతాన్ని పట్టుకొని హృదయానికి దగ్గరగా నిలబెట్టుకున్నారు. ఆ నిశ్శబ్దంలోనే వారికి గతమంతా అవగాహనయింది.

"నిన్ను నా దగ్గరే వుంచేసుకుంటే నా ఆనందానికి పాడుతూవుందువు. కాని నేనిప్పుడు విన్నగానము శాశ్వతమైనది. అందుతో లీనమ్మై పరవశించి నీకు నువ్వు అనంత మనుభవిస్తూ పాడావు. ప్రతిస్వరచ్ఛాయా, భావన, కంపము అగ్రతతో పొందు కూర్చుకొని తను జేయమ్మైన రవ సుస్పష్టమైనది. జలాశయములోని నీరు ఎండకి మరిగి ఆవిరై వర్షించి నట్లు నీ కష్టాలతో నీవు మున్గి నాదసుధా ధార కురిపించావు. నువ్వు ధన్యురాలివి. మన మిత్రులంతా నీ రాక కోసం ఎదురు చూస్తున్నారు. నాతో జయ ఉదే రు మరకతా" అన్నారు చెట్టియారు.

"మన మిత్రులు నాపై వుంచిన అభిమానానికి నాకు అంటుగట్టిన కీర్తికి ధన్యురాలిని. నాకు చాలా సంతోషము కలిగించినది తెలియజేయండి. నేనిక్కడ శాంతంగా వున్నాను" అన్నది మరకతం.

మరకతానికి మరికొన్ని నుంచి జన సౌకర్యాలు అమర్చి మూడోనాడు చెట్టియారు వెళ్ళిపోయారు.

మదరాసులో అభిమానులంతాకూడిచక్కని గాంధర్వ వేదికా భవనము నిర్మించారు. అందులో మరకతం చెట్టియార్ల ఫొటోలు పెద్ద చిత్రాలిచ్చిన వారిఫొటోలు ప్రోగాత

తీసారు అందులో నిత్యం కచ్చేరీలు జరుపుకుంటున్నారు

* * *

విశ్వేశ్వరుడు మరకతం కోర్కె నెరవేర్చాడు. కొడుకుపై మమకారముతో "ఒక్కసారి నే దచ్చిపోయేలోగా నా బిడ్డను నాకు చూపించు తండ్రీ" అనివేడుకునేది. ఒక రోజు వుదయం పదిగంటల వేళ సూటూ బూటులో దొరబాబులాగున్న ముప్పై సంవత్సరాల యువకుడు తన యెదురుగా వచ్చి నిలబడ్డాడు. అరూపు ఆకీపీ వస్పుటంగా కల్యాణసుందరంగార్ని జ్ఞప్తికి తెస్తున్నాయి. "ఎవరుబాబూ" అంది మరకతం. చంద్రకాంత్ తల్లిని గుర్తుపట్టలేదు. తల్లిని పడుచుగా వున్నప్పటి ఫొటోలో చూడ్డమే గాని ఫలానాగా వుంటుందని గుర్తులేదు వాడికి. లీలగా తెలుపని, అందమైనదని గుర్తు. వలిగిన బట్ట, సంస్కారము ఎరుగని నెరసిన జుట్టు ముడిలో చూసిన ఆమెని తన అమ్మ అనుకోడానికి కూడ వీలుగా లేదు. పైగా వ్యామోషిగావుంది.

"నేను కల్యాణసుందరంగారి అబ్బాయిని. చంద్రకాంతుని. యిక్కడ మరకతం అన్న ఆమె వున్నారండీ?"అనిఅడిగాడు. మరకతం"బాబూ నువ్వుచంద్రకాంతువా?"అని రుద్ధకంఠముతో రెండు చేతులూ పుచ్చుకొని వీపునిమిరి "నే... ను నే... ను మీ అమ్మని" అంది.

"మీరు... నువ్వు నా అమ్మవా"అన్నాడు చంద్రకాంతు.

"మీరు మద్రాసులో చెట్టియారుతో ఉన్నారని మా నాయనగారు చెప్పారే? నేను ఎన్నిసార్లో సెలవుల్లో అమ్మదగ్గరకి వెళ్తానంటే "మీఅమ్మ ఎక్కడుందని వెళ్తావ్? మీ అమ్మని చెట్టి ఎత్తుకు పోయాడు! అన్నారు. నాకప్పట్లో యేం బోధ పర్చుకోలేకపోయాను. ఇల్లాంటిచోట ఉన్నావేమిటమ్మా? ఇక్కడ—ఇక్కడనీకువ్రూపిరెట్లా ఆడుతోంది? నాకాడ్డంలేదు. అవి కిటికీలేనా ? గూళ్లా?"

"పదేళ్లగా నాకాశ్రయమిచ్చిన చోటు నీకు ఇబ్బందిగా వుంటే ఎల్లాగరా ? ప్రక్కనే దుకాణం వుంది. నీకో పంచ తెప్పిస్తాను.యిబ్బంది లేకుండా కూర్చొని కబుర్లు చెప్పు బాబూ. నీ చదువు పూర్తయిందా? యేంచేస్తున్నావు ?"

"పంచవద్దుగాని యిల్లా కూర్చుంటాములే"అని యిటుకలమీద ఎత్తుగా వుంచిన ట్రంకు పెట్టెమీద కూర్చున్నాడు.

# మాతృమూర్తి

జరిగినకథ : 4 సంగీత నాట్యాలతో ఆరితేరిన మరకతాన్ని చేపట్టారు కళాభిమాని అయిన చిదంబరం చెట్టియారు. తను తల్లి కావాలన్న తపనతో చెట్టియార్ని వదలి న్యాయమూర్తి కళ్యాణసుందరాన్ని వివాహమాడుతుంది మరకతం. మరకతం ఎవరో తెలుసుకున్న కళ్యాణసుందరం తల్లి ఆమెని దూరంగా ఉంచుతుంది. మరకతానికి పుట్టిన బిడ్డ విషయమై అనుమానంతో ఆమెని నిరాదరిస్తాడు కళ్యాణసుందరం. కళ్యాణసుందరం కొడుకుని తనతోపాటు ఢిల్లీ తీసుకుని వెళ్లిపోవటంతో బాధపడినా కూతురు గోమతిని పెంచి పెద్ద చేస్తుంది మరకతం. కూతురు గోమతి భర్త రాజగోపాలంతో విదేశాలకు వెళ్ళిపోవటంతో కూతురు, అల్లుడు; భర్త, కొడుకు, అందరూ ఉండి ఒంటరిదైన మరకతం కాశీవెళ్లి విశ్వేశ్వరుని సన్నిధిని కాలం గడుపుతుంటుంది.

"నా చదువు అయింది. మద్రాసు హైకోర్టులో ఎడ్వకేటుగా ప్రాక్టీసు చేస్తున్నాను."

నాయనగారివృత్తే చేపట్టావన్న మాట. నాయనగారు బాగున్నారా?

నాయనగారి నిజవృత్తాంతం ఈమెకి చెప్పాలా వద్దా ? ఆయనకి కుష్ఠు. అంతయింటిలో వొంటిపిల్లి రాకాసిలా వున్నారు. విరివిగా డబ్బుఖర్చుచేసి ప్లాస్టిక్ సర్జరీ చేయించుకున్నారు. సిల్కు పైజమా తొడుక్కొని జలతారు వోణి కప్పుకొని ముఖమల్ చడావులు వేసుకొని వాటి క్రింద జబ్బు దాస్తున్నారు. శరీరం వ్యాధిగ్రస్తమైతేనే గాని మనసుకు పట్టిన రోగం మైలా వదలవు. అమ్మకి యిల్లాంటి అన్యాయం చేసినందుకే అల్లాంటి జబ్బు వచ్చివుంటుంది.

"యేమిట్రా దీర్ఘంగా ఆలోచిస్తున్నావు? నాయనగారు ఎల్లా వున్నారు ?"

"ఆ! బాగున్నారు. రిటైర్అయి హైదరాబాద్ వెళ్లి పోయారు,"

"నేనిక్కడున్నట్లు ఎల్లా కనుక్కున్నావు బాబూ ?"

"నీ పేర మద్రాసులో ఒక గాంధర్వ మందిరం కట్టారు. ప్రముఖులంతా చందాలు వేసారు. అది తెరచిన నాడు నాకు ఆహ్వానం వస్తే వెళ్లాను. అక్కడ గోడకి నీ ఫోటో చూసాను. ప్రసంగంలో ఆభవనం నీ పేర కట్టినట్లు నువ్వు కాశీలో వున్నట్లు తెలిసింది. ప్రసంగిస్తున్నాయన వొకరు పత్రికా విలేఖరుల వైపు తిరిగి వారి నుద్దేశించి "దయచేసి ఈ చెప్పే విషయం ప్రచురించకండి.

"ఆప్రబుద్ధుడుకల్యాణసుందరం ఢిల్లీ..." అంటూ చెప్పబోయాడు. అధ్యక్షత వహించిన చెట్టియారు "మీరు ప్రసంగం పొడిగిస్తున్నార"ని మందలించారు. నీలో యింత విద్వత్ వుందని అప్పుడే విన్నాను. నాయనగారు మనని మోసం చేసారు. నాకు నిన్నొకసారి చూడాలని ఆశగల్గి వచ్చాను. అమ్మా! ఫారెన్ మేగజైన్‌లో శ్రీమతి మరకతం కూతురు గోమతి నాట్య అకాడమి పెట్టిందని పడింది. నా చెల్లెలేనా యేమిటి?" "అవును బాబు. నీ చెల్లెలే. దాని భర్త అత్తవారు చాలా మంచివారు. దాని భర్త డాక్టరు, కేన్సరు ఆస్పత్రిలో పనిచేస్తున్నాడు. గోమతి లింకన్ ఆర్ట్సు సెంటర్‌లోను వైట్‌హౌస్‌లోను వివిధ యూనివర్సిటీల్లోనూ కూడా నాట్యప్రదర్శనలిచ్చింది. దానిచేత నీ బావఅన్న ప్రకారం ప్రదర్శనలిప్పించి మన నాట్యప్రతిభవిదేశాల్లో ప్రచారం చేయిస్తున్నాడు. నీకు పెళ్లయిందిరాచంద్రా?"

"మూడునెల్ల క్రిందటే చేసుకున్నాను. మలయాళీఅమ్మాయి ఎమ్.ఎ. ప్యాస్‌అయింది. నీకు చూడగా సర్దుకోవలసిన సామాను కూడా లేనట్లుంది. నాతో బయలుదేరమ్మా. రేపే మద్రాసు వెళ్లాలి."

మరకతానికి వెళ్లాలని లేదు. కూతురు అల్లుడు,చెట్టియారు వచ్చిచూసారు. తను యే వొక్కరి వద్ద చేరినా మిగతా యిద్దరికిదూరం కావలసి రావొచ్చు. "ఆలోచించకమ్మా"

"నువ్వు నా దగ్గరికి వస్తున్నట్లు నన్ను తీసుకు వచ్చేట్లు నీ భార్యకి చెప్పావా ?"

"లేదు ఢిల్లీలో పనివుందని చెప్పివచ్చాను"

"తరువాత వస్తానులేరా, నిన్ను చూడ్డం నాకెంతో సంతోషము తృప్తి కలిగాయి. నా కోర్కె ఫలించింది. నీ భార్యకి కూడా చెప్పి వుత్తరంరాయి. నువ్వు ప్రయోజకుడవైనావు. ఈ సంతోషం చాలురా నాకు. నువ్వు తీసుకు వెళ్లకపోయినా నేను బాధపడను. నేనిక్కడ హాయిగానే వున్నాను

**మంత్రుల హామీలు :**

కేంద్రం స్థాపించే హైదరాబాద్ విశ్వవిద్యాలయంలో ఆంధ్రప్రదేశ్ వారికి ఎక్కువ సౌకర్యాలు వుండేట్టు ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు, శాసన సభలోను, కేంద్ర విద్యామంత్రి శ్రీ నూరుల్‌హసన్ రాజ్యసభలోను హామీలు ఇవ్వడం కొంత సమాశ్వాసం కలిగించినా, చట్టంలోనే అలాటి నిబంధనలుంటే బాగుండునని అనుకునే వారే ఎక్కువగా వున్నారు ఇప్పుడు దేశంలోని కేంద్ర సాంకేతిక కళాశాలల వంటి వాటిని చూస్తూనే వున్నాము, వాటిలో స్థానిక విద్యార్థుల శాతం ఎంతవుందో విద్యావేత్తలకు తెలియనిది కాదు ఏమైనా మంత్రుల హామీలు పూర్తిగా అమలు కాగలవనే విశ్వసిద్దాం

**నాయకుల శిలా విగ్రహాలు :**

ఒంగోలులో ఆంధ్రకేసరి శిలా విగ్రహం, కర్నూలులో సంజీవయ్యది, పిఠాపురంలో గాని కాకినాడలో గాని పిఠాపురం మహారాజా శిలావిగ్రహాన్ని స్థాపించాలని నాయక స్మారక స్థాపన సంఘం ఆగస్టు 19 న ముఖ్యమంత్రిని కోరడం చాల సహేతుకంగావుంది ఆంధ్రకేసరి పేరును మన ప్రభుత్వం ఒకజిల్లాకే పెట్టి ఆయన ఎడలగల గౌరవం ప్రకటించారు పిఠాపురం ప్రభువు శ్రీ సూర్యారావు సాహిత్యానికేకాక దేశానికీ ప్రచ్ఛన్నంగా ఎంతో సేవ చేసిన వారు శ్రీ సంజీవయ్య శక్తి సామర్థ్యాలు దేశ విదితాలు ఆయన జీవించివుంటే రాష్ట్రపతి అయ్యేవాడనే వదంతి వుంది. నిజమైన గౌరవం నాయకుల గుణాలు అనుసరించడమే అయినా, సామాన్య జనుల ప్రోత్సాహానికి శిలా విగ్రహాల స్థాపన తోడ్పడుతుంది

# హైదరాబాద్ నోట్ బుక్

**తెలుగుపై అరబ్బీ ప్రభావం :**

అరబ్‌దేశాల దూతలకు, భారత్ అరబ్ సమైక్య దినం సందర్భంగా ఆగస్టు 18 న ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో జరిగిన సన్మానసభలో భారత విదేశాంగ మంత్రి శ్రీ స్వరన్‌సింగ్ ప్రసంగిస్తూ భారతదేశం ఇరుగు పొరుగు ఆరబ్ దేశాలతో సన్నిహిత మైత్రితో మెలగడమే ఏకైక లక్ష్యంగా ప్రవర్తిస్తుందన్నారు తక్కిన అందరి ప్రసంగాలకన్నా మాజీ ముఖ్యమంత్రి శ్రీ పి వి నరసింహారావు, ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రసంగాలు శ్రోతలని, చాల సంతోషపరిచాయి పెక్కు అరబ్బీ పదాలు తెలుగులో చేరిపోయి, తెలుగు పదాలుగా చెలామణి అవుతున్నాయని, భారతీయులు, ఆరబ్బులు ప్రపంచ విజ్ఞాన వికాసానికి అనగా అవగాహనకు ఎంతో సేవ చేశారని శ్రీ నరసింహారావు అన్నారు తెలుగు దేశానికి ముఖ్యంగా పాత హైదరాబాద్ రాష్ట్రానికి అరబ్ దేశాలతో ఐదు శతాబ్దాలుగా గల సంబంధాన్ని ముఖ్యమంత్రి వివరించారు. ఆ కారణంగానే పలువురు అరబ్బులు తెలుగు దేశంలో స్థిరపడ్డారని ఆయన అన్నారు సైనికులుగా ఆరబ్బులు మొట్టమొదట వనపర్తిలో స్థిరపడ్డారని, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి అనే వారునాతో ఏ అరబ్బును నీ వూరు ఏది అని అడిగితే, బంబర్తి అనేవాడనిఆయన సోదాహరణంగా తెలిపేవారు.

**పదినిమిషాలకొక కుక్కకాటు :**

జంటనగరాలలో పది నిమిషాలు కొకకుక్కకాటు అంటే ఎవరికైనా ఆశ్చర్యం కలుగవచ్చు కాని ఈ సంగతినిహైదరాబాద్ మునిసిపాలిటీ ప్రత్యేకాధికారి శ్రీ నరేందర్ లూథర్ పత్రికా ప్రతినిధులఇష్టాగోష్టిలో తెలిపారు నిరుడు 50 వేల కుక్క కాటు కేసులు నమోదు చేశామని ఈ సంవత్సరం మొదటి ఆరు నెలల లెక్కలింకా కట్టలేదని అన్నారు వీధి కుక్కల బెడద తొలగించడానికి మునిసిపాలిటీ తీవ్ర చర్యలు తీసుకుంటుందన్నారు

**ఉపశ్రుతి :**

"మంత్రి కావడానికి అర్హతలేమిటోయ్!" అనడిగాడు ఒక మిత్రుడు "వాగ్దానాలుచేయడం, వాటిని తీర్చలేక పోవడం, ఎలా జరిగిందో నచ్చజెప్పటం మొదటి అర్హత" అని జవాబు

—తిరుమల రామచంద్ర

"యిప్పుడు రావన్నమాట"

"తరువాత వస్తాగా భోజనానికిలే నా చేత్తో నీకు పెట్టాలని వుంది శివాలయం నుంచ ప్రసాదం తెచ్చిన కుర్రవానిచేతే వొక మల్లుపంచె గట్టిపెరుగు తెప్పించి కొడుక్కి అన్నం పెట్టింది

తల్లినిచూసిన సంతోషంలో భార్యని తలవలేదు తనకి తల్లి లేదనే ఆ అమ్మాయి అనుకుంటోంది యిప్పుడు తల్లిని తీసుకు వెళ్తే యేమనుకుంటుందో వూహించడం కష్టం తల్లి యిప్పుడు రాననడం వొకవిధంగా మంచిదేమోనని రెండో ఆలోచన వచ్చింది,

భోంచేసిన కొడుకు "నన్ను వొక్కణ్ణే వెళ్లమంటావా ?" అన్నాడు

"వెళ్లిరా బాబు ఉత్తరంరాయి ఆయురారోగ్యాలు కల్గి నువ్వు నీ భార్యా అన్యోన్యంగా వుండండి నువ్వు పట్టినదల్లా బంగారంకావాలి ఎంత పెద్ద వుద్యోగాలుచేసినా నిగర్విగా వుండు ఇదేరా నా ఆశీర్వాదం నేనివ్వగలిగిందీనూ"

అతను తల్లికి నమస్కరించి వెళ్లిపోయాడు.

పదిరోజులతరువాత చంద్రకాంత్‌వుత్తరం వచ్చింది "నేనూ కోడలు ఆలోచించాము నీకక్కడ ఎప్పుడు బాగుండకపోయినా వెంటనే వచ్చెయి. నీ కు డబ్బు అవసరమై నప్పుడు కూడా రాయి పంపుతాను '

## మాతృమూర్తి

వుత్తరంచదువుకొని మరకతంనవ్వుకొంది

నాలుగేళ్లు జరిగిపోయినాయి చెట్టియారుకి గుండెపోటువచ్చి తగ్గి మంచంమీద వున్నారు డాక్టరు పరీక్షించి "నెల రోజులు విశ్రాంతిగా వుండండి యింట్లో కొద్దిగా తిరగొచ్చు భయంలేదని" చెప్పారు

మంచంమీదున్న చెట్టియారికి మాత్రం తన రోజులయిపోయాయనిపిస్తోంది కొడుకునిపిల్చి "నాయనా నన్ను కాశీ తీసుకు వెళ్లరా" అన్నారు తండ్రి వుద్దేశ్యం గ్రహించిన కొడుకు "నాయనగారు కాశీనే యిక్కడికి తేనా? మీకుప్రయాణంమంచిదికాదు" అన్నాడు

భార్య అందుకొని "మరకతం రావలసిందే రేపు యే చెయ్యో కాలో సరిగా లేకపోతే చూసే దిక్కెవరు ? వచ్చి నాయనగారి దగ్గర పాడుతూ వుండమని మరీ మరీ చెప్పు రేపే కలకత్తా దాకానో ఢిల్లీదాకానో ప్లేన్‌లో వెళ్లి ప్లేన్‌లో రండి" అంది

చెట్టియారు చిరునవ్వు నవ్వి "ఔను" అంటుండగా తిరిగి గుండెపోటు వచ్చి వాలిపోయారు. ఆయన అస్తికలు నిమజ్జనం చేయడానికికొడుకు కాశీ వెళ్లాడు. తనతల్లి ఆదేశం ప్రకారం మరకతాన్ని చూసాడు. "నాతో వచ్చేయండి పిన్ని ఈ వృద్ధాప్యంలో వంటరిగా వుండలేరు ఇది నాయనగారి ఆఖరి ఘడియలలో చెప్పినమాట కూడాను కాదనకండి" అని పిల్చాడు మరకతం కళ్లు తుడుచుకొని నేనుమాత్రం యింకా ఎన్నాళ్లుండబోతాను బాబు ?" అంది "గంగాస్నానం చేసివస్తా" అని బయలు దేరింది "నాయన నన్ను తీసుకు రమ్మన్నారా ?" అని పదే పదే పిచ్చిదానిలా అనుకుంది "మరకతం మీదగ్గరకేవచ్చేస్తోందితీసుకోండని" ముందుకు నడిచింది! మెట్లుదిగుతుండగాగంగపొంగుతూ మెట్లపైకిఎదురొచ్చిమరకతాన్నిపొదువుకుంది

ఆహా ! ప్రతివారు మృత్యువుని తలచి అనేక రకాల భయభ్రాంతు లౌతుంటారే ! ఎంతమందికి కోరగానే మృత్యువు ఎదురొచ్చి కౌగలించి ప్రేమగా తీసుకు వెళ్తుంది ?

మరకతానికి కాశీలో సన్నిహితులుగా వున్న వృద్ధ దంపతులు యెవరోకాదు ఆనాడు హైదరాబాద్ వీధుల్లో "హరె కృష్ణా ! ముకుందామురారే" అని పాడుకుంటూ మరకతం హృదయం స్పందింపజేసిన బిక్షకులే వారు ఆ రాత్రి గంగ వొడ్డున మెట్లపై కూర్చున్నారు పురుషుడు అడిగాడు "నీకు వినిపిస్తోందా ?" స్త్రీ "ఆ" అన్నది.

ఆ ప్రవాహ చిరుకెరటాల మంజీర రవములో వారు అనుదినము మరకతం పాట వింటున్నారు. (అయిపోయింది)

# వెంకటరాఘవన్ కి ప్రియమైన కాఫీ:

## నెస్‌కాఫీ!



"ఉత్తేజ భరితమయిన టెస్టు ఆఖరున ఒక కప్పు వేడి వేడి నెస్‌కాఫే విలువ తెలుస్తుంది అలసట తీరాలంటే దానితోనే"

అతనికి తెలుసు కాఫీకి అలవాటుపడినవారికి తెలిసినట్టు ఇతర ఇన్‌స్టంట్ కాఫీలన్నిటికన్న నెస్‌కాఫే విశిష్టమని. దాని ప్రత్యేకం తనవంటి కాఫీ కాముకులకోసం తయారు చేశారు అత్యుత్తమమయి 100% పరిశుద్ధమయిన దక్షిణాది కాఫీ గింజలతో.




## నెస్‌కాఫీ

నెస్‌కాఫే యిప్పుడు ప్రియమైనవారికి అత్యంత ప్రియమైనది

ACIL 90(1) 233 TEL

# సమదర్శి • ధర్మపథం • బులుసు వేంకటరమణయ్య

ఎక్కువ, తక్కువ భేదం చూపకుండా, ఉత్తమం, అధమం అనే వ్యత్యాసం లేకుండా సర్వసముడై ఉన్నవాడే గొప్ప యోగి. అన్నిటినీ సమదృష్టితో చూచేవానికి ఎట్టి విచారమూ ఉండనే ఉండదు.

శ్రీ రామకృష్ణ పరమహంస దక్షిణేశ్వరం లోని ఆలయంలో దేవిపూజ చేస్తూ వుండి నప్పుడు ఒక సన్న్యాసి కొలది దినాలు అక్కడ ఉండడం తటస్థించింది. ఒకనాడు అతనికి ఏమీ ఆహారం దొరకలేదు. అతడు ఒకర్ని అడగలేదు. ఆకలి బాధ ఎక్కువయింది. ఇంతలో అతనికి దగ్గరలో ఎంగిలాకులు పడిన చప్పుడు వినిపించింది. అతడు ఆ విస్తరాకుల దగ్గరకు వెళ్లినప్పటికే ఒక కుక్క కొన్ని ఆకులను నాకుతున్నది. సన్న్యాసి కొన్ని ఆకులనుడుర్చి, కొంత ఆహారం సంపాదించి, దానితో పొట్టనింపుకున్నాడు. తర్వాత గుడిలోనికివచ్చి, దేవిని ధ్యానించి తృప్తిపడి తన దారిని పోసాగినాడు.

అతని సంగతిని పరమహంస గ్రహించాడు.

ఏదో మనస్సులో సంశయగ్రస్తుడైన తన శిష్యుణ్ణి పిలిచి, ఆ సన్న్యాసివెంట వెళ్లి, ఆయన చెప్పినదానిని తనకు తెలియజేయ వలెనని కోరాడు.

శిష్యుడు ఆ సన్న్యాసిని వెంబడించి కొంత దూరం వెళ్లాడు. సన్న్యాసి దానిని గమనించి తనవెంట రావడానికి కారణాన్ని ప్రశ్నించాడు. 'తమ ఉపదేశం కోసం' అని సమాధానం వచ్చింది.

'దుర్గంధ పూరితమైన మురికికాలువ నీటిని, పవిత్రమైన గంగానదీజలాన్ని నీవు సమానంగా చూడడం నేర్చుకోవాలి అలా చూచే యోగ్యత కలిగినప్పుడు నీ మనస్సులో ఎట్టి విచారమూ ఉండదు. నీ జీవితం సుఖంగా గడుస్తుంది. నేను దాన్ని అభ్యసించి కృతార్థుడనయినాను. నాకు ఏ విభేధమూ కావరాదు. ఏ విచారమూ లేదు' అన్నాడా సన్న్యాసి.



దీనితో ఆ శిష్యుని మనస్సులోని సందేహం మాయమైపోయింది.

అతడు పరమహంస వద్దకు వచ్చి, తల వంచుకొని నిలిచి, సన్న్యాసి ఉపదేశించిన దానిని మెల్లగా వినిపించాడు.

సీరియల్

# పుత్తడి బొమ్మ

రామవరపు వేణుగోపాలరావు

*(గత సంచిక తరువాయి)*

"ఏమిటమ్మా అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?" అన్న కొడుకు ప్రశ్నకి ఉలిక్కిపడింది సరస్వతమ్మ. వణుకుతూన్న చేతితో చెంగు అందుకుని కళ్లు ఒత్తుకుంది.

"ఏమీ లేదులేరా"

"నువ్వెందుకలా వూరికే ఏదేదో ఆలోచిస్తూ మనస్సు పాడు చేసుకుంటావ్ ?"

"ఏం లేదులే. సరేగానీ బయల్దేరుతున్నావా ? వేగిరం వెళ్లమరి ! పదికల్లా అక్కడుండాలి నువ్వు... అన్నట్టు ఒరేయ్ ! రిక్షా ఎక్కి వెళ్లు. చిల్లరుందా?"

"వుందిలేవే"

"మరైతే బయల్దేరవేం? రాహు కాలం రాకుండా అక్కడుండాలి !"

"ఓ. అలాగే వుంటాను."

"ఒరేయ్ ! అన్నట్టు వాళ్లింట్లో ఏం తినకు. కతికితే అతకదు అంటారు. పార్వతీశంగారిని రేపో సారి మనింటికి రమ్మను వాళ్లావిడని నేను అడిగేనని చెప్పు ! ఏం ?"

"అయ్యయ్యో. చంపేశావు... అమ్మా ! నేను వెళ్లేది వాళ్లింటికి కాదు."

"వాళ్లింటికి కాదూ? మరెవరి యింటికిరా?"

"పార్వతీశంగారింటికి వెళ్లనని నీకు యిందాకే చెప్పేను. నే నిప్పుడప్పుడే పెళ్లి చేసుకోను !"

"ఒరే ఒరే ఏమిట్రా. యిదీ ?" అదురుతున్న గుండెతో అంతకన్నా ఏమీ అనలేకపోయింది సరస్వతమ్మ. నెమ్మదిగా లేచి నిలబడింది.

"అలా కంగారు పడకమ్మా... కొంపేం మునిగి పోదు. ఎవరి చేతనేనా నేను రావటంలేదని వాళ్లకి కబురు చెయ్యి. నేనలా బెలగాందాకా వెళ్లొస్తాను"

"అక్కడికి కాకపోతే మరెక్కడికిరా ఈ ప్రయాణం ?"

"అక్క దగ్గిరకి... వాళ్లని చూసి చాలా రోజులైంది !" అంటూ గబగబ వీధి గుమ్మంవేపు నడిచేడు రవి.

"ఆ దౌర్భాగ్యురాలి ఇంటికి వెళ్లొద్దని లక్ష సార్లు చెప్పేన్నీకు." అంది సరస్వతమ్మ కోపంగా.

కాని రవి ఆగలేదు. వెనక్కి తిరిగి చూడనైనా లేదు. వీధి గుమ్మం దిగుతూ తలుపు చేరేశాడు.

నిలబడే ఓపిక సన్నగిల్లి గది గుమ్మానికి ఆనుకుని నేలమీద చతికిలపడింది సరస్వతమ్మ. భగభగ మని మండుతూన్న గుండెని అరిచేత్తో రాసుకుంది.

## 2

"వానల్లు కురవ్వు
వరిసేలు పండవు
మాయమ్మ వొండదు
మా కడుపు నిండదు
బదుగో—బదుగో !" అని చింతచెట్టు కింద నలుగురైదుగురు కుర్రాళ్లు పాడుకుంటూ ఆడుకుంటున్నారు. వాళ్లు నల్లగా వున్నారు. వాళ్ల ఒంటిమీద గోచీగుడ్డలు తప్ప మరేం లేవు. చింత చిగురు నములుతూ తెయ్యిమని గెంతుతున్నారు.

బుగతగారి కల్లంలో పనిచేసే తండ్రి కోసం ఎల్లంది తీసుకువెళ్తున్న చుక్కమ్మ చింతచెట్టు దగ్గిర ఓ నిమిషం ఆగి, ఆడుకుంటున్న నల్లపిల్లల్నీ చోద్యంగా చూసింది. తనలో తానేదో గొణుక్కుని మళ్లీ నడక ప్రారంభించింది.

దూరంగా నాచురంగులో కొండలున్నాయి. కొండల పాదాల దగ్గర ముదురాకు పచ్చరంగులో చెట్లు నిశ్చలంగా నిలబడివున్నాయి. అంతకు ముందు పచ్చగా వుండే వరిచేలు అదృశ్యమై వాటిస్థానే పొలాల్లో కుప్పలున్నాయి.

'ఈ పాలేనా అయ్య సేత కోక కొనిపించాల. ఈ సింకి కోకతో ఈదిలోకొచ్చి నలుగురి కళ్లల్లోనీ పడాలంటే పేణం సిగ్గుతో సస్తన్నాది. సి.సి!' అనుకుంది చుక్కమ్మ.

అప్పటికే ఆ ఆలోచన వచ్చేసరికే దాని కళ్లల్లో నీళ్లు నిలిచిపోయేయి. పక్కనున్న తాటితోపులోంచి వస్తున్న గాలి కళ్లలోపడి అదోలా అన్పించింది. లయబద్ధంగా అడుగులు వేస్తూ పొలం గట్టమ్మట గబగబ నడవసాగింది చుక్కమ్మ.

అలా నడిచి వెళ్తున్న చుక్కమ్మకి లచ్చి ఎదురు పడింది. అది కట్టుకున్న చిరుగుల లంగానీ, వల్లెవాటుగా వేసుకున్న మాసిన గావంచానీ, దాని ముక్కుకి వున్న రాగిలీగనీ, దాని కాళ్లకున్న సిల్వరు కడియాల్నీ మార్చి మార్చి చూసింది. చుక్కని చూస్తూనే లచ్చి ఆగిపోయి నవ్వింది, పలకరింపుగా. 'ఉస్సు' అంటూ చేతిలో వున్న కంపకట్టనీ, నెత్తిమీదున్న పేడతట్టనీ నేలమీదికి దింపి అలుపు తీర్చుకుంది.

"సింతకంపా, పేడా సిటికెలో ఎత్తుకొచ్చేవే—లచ్చిగుంటా—నక్కతోకగాని తొక్కేల్లినావేటి ?" అంది చుక్కమ్మ లచ్చిని చూచి నవ్వుతూ. దాని నవ్వులో ప్రశంస వుంది.

"నక్కతోక కాదు లేయే—గవరయ్య బుగత కాలు తొక్కినాను..."

"ఓలోలె...అదేటే!" చుక్క ఆశ్చర్యపోతూ లచ్చి భుజం మీద చెయ్యేసింది.

"ఏట్నేదులే- ఏటెప్పమంతావు. నా అదుట్టం బాగుందీయేల. గవరయ్య బుగత నన్ను సూసీ సూడగానే పిల్సి 'నీ యిట్టవొచ్చినంత కంపా, ఆ పేడా ఒట్టుకెల్లే ఒలే గుంటా' అన్నాడు. అయన్నీ గబగబ ఎత్తుకోని పొవొస్తంటే యికటంగా నవ్వుతూ నా సెయ్యట్టుకున్నాడు..."

"సెయ్యట్టుకున్నాడా, ఎందుకే ?"

గడగడలాడే గుండెతో, అదురుతున్న గొంతుకతో ప్రశ్నించింది చుక్కమ్మ. దాని భయానికి కారణం లేకపోలేదు. దాని తండ్రి ఆ గురవయ్య బుగత దగ్గరే కంబారిగా పని చేస్తున్నాడు. అది యిప్పుడా బుగతగారి కల్లంలోనే పని చేస్తున్న తండ్రికి సల్లంది తీసుకెళ్తోంది.

"సచ్చినోడికికో పనేటుంది ? అల సేతులూ ఈల సేతులూ ఒట్టుకోడం, గోతులు తవ్వడం, కొంపలు కూల్చడం తప్ప ఆడికింకో పన్నేదు. దుక్క సచ్చినోడు. ఈడమ్మ కడుపెప్పడు కాల్తాదో !" అంటూ శాపనార్థాలు పెట్టింది పధ్నాలుగేళ్ల లచ్చి మెటికలు విరుస్తూ.

"ఒలే లచ్చీ... నాకు బయ్యమేస్తందే... ఈ సల్లంది తీసికెల్లి మా అయ్య కెలాగే యియ్యడం?"

"కల్లం కాడ మీ అయ్యుంటే నీకేటే బయ్యం ?" అని భరోసా ఇచ్చింది లచ్చి.

అయినా చుక్కమ్మ భయం పోలేదు. సమితి ప్రెసిడెంటుకి తమ్ముడూ, రంగిపాలెం పంచాయితీ బోర్డు ప్రెసిడెంటూ, భూస్వాముల్లో ఒకడూ, మహా దుర్మార్గుడూ అయిన గవరయ్య బుగత కళ్ల ముందు మెదిలేడు దానికి. గిరజాల జుత్తూ, నలభయ్యో పడిలో పడి సగం సగం నెరుస్తూన్న చెంపలూ, మెలి తిరిగిన మీసాలూ, వాడి చూపులూ, ఎర్రని జీరలుండే కళ్లూ, కల్లీ లాల్చీ, మల్లు పంచె, చేతిలో కణకణ మండే చుట్ట... వీటన్నిటితోనీ గవరయ్య బుగత కళ్లముందు హఠాత్తుగా నిలబడ్డట్టు అయింది దానికి. బుగ్గలు పూరించి నవ్వుతూ, ఓ చేత్తో మీసం మెలేస్తూ, మరో చేత్తో తన చెయ్యి పట్టుకుని లాగుతూ 'రాయే సుక్కా' అన్నట్టనిపించింది. ఉలిక్కిపడింది చుక్కమ్మ. గాభరాగా 'థూ థూ' అంటూ గుండెల మీద ఉమ్ముకుంది.

"ఒలే లచ్చీ... గవరయ్య బుగత కల్లంలో మా అయ్య వుంటాడుగానీ... ఈ సల్లందిచ్చీమీ... పచ్చి నీ కడుపున పుడ్తానే... ఒలే — ఒలే —" అంటూ లచ్చిని బతిమాలింది.

"ఓ లమ్మోలమ్మ ! నానక్కడికి మళ్లీ ఎల్లడమే ! నా వశం కాదు బాబో... నే నెల్లిపోవాలి !" అంటూ మరో మాట వినకుండా, నేలమీదున్న పేడ తట్టని నెత్తిమీదికి ఎత్తుకుని, చింతకంప చేతిలోకి తీసుకొని, పరుగులాంటి నడకతో వూరివేపు సాగిపోయింది లచ్చి.

అది వెళ్లిన దిక్కే చాలాసేపు చూస్తూ నిల్చుండిపోయింది చుక్కమ్మ. దానికి ఎంతో దిగులుగా, భయంగా వుంది. లచ్చి కనబడి 'సెయ్యట్టుకోడం సంగతి సెప్పకపోయినా బాగుణ్ను!' అనుకుంది. అప్పటికే చాలా పొద్దెక్కిపోయింది. 'సల్లంది' కోసం అవురావురుమని ఎదురుచూసే తండ్రి దానికి జ్ఞాపకానికి వచ్చేడు. చేసేది లేక

*జరిగిన కథ 1 :* సరస్వతమ్మ వ్యసనపరుడైన భర్త క్షయవ్యాధితో మరణించటంతో ఒంటరి దవుతుంది. కులం కానివాడిని పెళ్లి చేసుకున్న కూతురు జానకిని వెళ్లగొడుతుంది. 'లా' చదువుతున్న రవి, పెళ్లి చూపులకు పోవ నిరాకరించగా బాధ పడ్తుంది.

నీరసంగా గవరయ్య బుగత కళ్లం వేపు అడుగులు వేసింది

*       *       *

తీరిగ్గా కూర్చోని ఆడకూలీలో సరసాలాడే మూడ్‌లో గవరయ్యబుగత లేడిప్పుడు అతని కళ్ల చంద్రనిప్పలు కక్కుతున్నాయి చింతరువ్వలు పట్టుకున్న చేతులు ఆవేశంతో ఏణికిపోతున్నాయి అతనికి ఎదురుగా నేలమీద పడివున్నాడు కంబారి పుల్లిగాడు వాడి చేతులూ, కాళ్లూ తాళ్లతో కట్టేసి వున్నాయి ఉండి ఉండి కెరటం వొచ్చినట్టు కోపం వస్తాంటే—గొడ్డుని బాదినట్టు వాడిని బాదుతున్నాడు గవరయ్యబుగత దుష్టజన శిక్షణని చిద్విలాసంగా చూస్తూ, బీడి కాలుస్తూ గడ్డి కుప్పమీద మరం వేసుకుని కూర్చున్నాడు కరణం కనకయ్య

చింతరువ్వ మీద పడగానే "అమ్మోలమ్మ" అనరిచేడు పుల్లిగాడు పుల్లిగాడి అరుపు వినలేక చెవులు మూసుకుందామనిపించింది రాములుకి ఏం చెయ్యడానికి లేక, అనడానికి నోటంట మాటరాక చేతులు కట్టుకుని నిలబడ్డాడు రాములు కూడా గవరయ్య బుగిత దగ్గర కంబారిగా పని చేస్తున్నాడు ఉండడానికి ఏభయ్యేళ్ల వయస్సున్నా—'ఇగసాల్లే బావ్, అణ్నొగ్గి' అనే చనువు గవరయ్య బుగత దగ్గర రాములికి లేదు తోటి కంబారిని పశువుకన్నా హీనంగా చావబాదుతూ వుంటే ఆ కంగారులో, అంతకు ముందు తన కడుపులో సల్లంది కోసం పరుగెత్తిన ఎలకల్ని మర్చిపోయేడు

ఈ గలభా విని చుట్టు పక్కల పొలాల్లో పని చేస్తున్న రైతులూ, కంబార్లూ, కూలీలూ మూగడం ప్రారంభించేరు. ఆ వచ్చిన వాళ్లలో ఆడవాళ్లున్నారు మగాళ్లూ వున్నారు. వాళ్లకి కళ్లూ, ఆలోచించగల మెదడూ వున్నాయి.

కాళ్లూ చేతులూ కట్టివేయబడి నేలమీద పడున్న పుల్లిగాడిని వాళ్ల చూసేరు వాడి ఆచ్ఛాదన లేని వీపుమీద చింతరువ్వ అద్దిన గుర్తుల్ని చూసేరు అక్కడక్కడ చర్మం చిట్లి కారుతున్న రక్తం చూసేరు ఉగ్ర నరసింహావతారంలా నిలబడి, ఆ చేత్తో ఓ రువ్వా ఈ చేత్తో ఓ రువ్వా పట్టుకుని ఎడాపెడా వాయిస్తూన్న గవరయ్య బుగతనీ చూసేరు. కిమ్మనకుండా బీడీ కాల్చుకుంటూన్న కరణాన్నీ చూసేరు చేతులు కట్టుకుని బితుకు బితుకు మంటూ నిలబడ్డ ముసిలి రాముల్నీ చూసేరు



గవరయ్య బుగత చేతిలోని రువ్వ మళ్లీ గాల్లోకి లేచి, ఛెళ్లుమని చప్పుడు చేసింది. 'అమ్మోలమ్మ అమ్మో!' అని బాధగా అరిచేడు పుల్లిగాడు

"ఎదవ కొడకా! తీరి కూర్చుని నా తిండంతా తిని యిలా బలిసావురా నువ్వు ఒల్లు కొవ్వెక్కి అబోతునాగ వూరాడోల్ల మీన పడ్తావురా దిక్కుమాల్న యెదవా!" అని మరోసారి రువ్వతో బాదేడు గవరయ్య బుగత

"బావ్! సచ్చిపోతున్నాను బావ్!"

"సవ్వురా. నీ కిదేరా సరైన మందూ" అని మరో దెబ్బ వేశాడు

'అమ్మో! నన్నొగ్గి బావు నన్నొగ్గి బావు!!" అని పుల్లిగాడు ఏడవడం మొదలెట్టేడు

"ఒగ్గియ్యాల్రా నిన్ను!? మా నాయనే నువ్వు సేసిన సెందాలప్పనికి సంపకుండా ఒగ్గియ్యాల్రా సెట్కారి నాయాలా! నీ "

"అమ్మోలమ్మ నాయిన్నాయిన సచ్చిపోతన్నాను బావో! మరెప్పుడు సెయ్యను బావో!" అంటూ దెబ్బలకి తాళలేక మట్టిలో దొర్లసాగేడు పుల్లిగాడు

"సెయ్యనిసేస్తే సాలుననుకున్నావేట్రా సెండాలపు ఎదవా?"

"అమ్మో అమ్మో "

"అచ్చోసిన ఆంబోతుననుకున్నావేట్రా ఎదవా, నువ్వు? పెద్దింటి పిల్లలమీద సెయ్యి సేసుకున్నాక — బూమ్మీద బతకాలన్న ఆసుందిరా నీకింకా?" అంటూ చేతనున్న చింతరువ్వ గాల్లోకి ఎగరేసాడు అలా గాల్లోకి ఎగిరిన చింతరువ్వ గాలిలోనే ఆగిపోవడం గమనించి, ఒక్కక్షణం గాభరా పడ్డాడు గవరయ్యబుగత

గవరయ్య బుగతతో పాటు నేలమీద పడున్న పుల్లిగాడూ, రాములూ, కరణం, చుట్టూ చేరిన జనం, అప్పుడే సల్లంది పట్టుకు వొచ్చిన చుక్కమ్మ— అంతా ఆశ్చర్యపోయారు ఆ సంఘటనతో వాళ్లలాగ ఆశ్చర్యపోనిది — గాల్లోకి లేచిన చింత రువ్వని పట్టుకు ఆపిన ధర్మయ్య ఒక్కడే!

"ఓరోరె—ధర్మిగా! బుగతలో కలబడుతున్నావ్ అంత పెద్దోడిని ఎప్పుడయ్యేవురోయ్?" అన్నాడు బుగత నిప్పలు కక్కుతున్నట్టు ధర్మయ్య వేపు చూసి

"పెద్దోలంతా సిన్నవన్ల 'సేస్తుంటే సూస్తూసి!"

"ఓహోహో మాటకి మాటా జవాబు చెప్తున్నావే—ఏట్రా నీ ఎవ్వారం?"

"అదే—నానూ అడుగుదామని సూస్తున్నాను"

ఈ గొడవలో తలదూర్చిన కొడుకుని చూసి రాములు వణికిపోయేడు. కొంపమీదికి ఏం గండం తీసుకొస్తాడోనన్న జడుపుతో అతని నోరెండి పోయింది తెలివి తెచ్చుకొని ఎలాగోలా గుటకమింగి "ఒరే—ధర్మిగా!" అని బిగ్గరగా కేక వేశాడు

"నువ్వుండ్రా ఓరయ్యా ఈ బావుకి నువ్వు

(30 వ పేజీ చూడండి)



# కించిత్ భోగే భవిష్యతి

వే. వేమూరి

*త్రిభువన సంచారి అయిన నారదుడు, విశాఖపట్టణపు సముద్ర తీరంలో నిలబడి, తన హస్త యుగళంలో వున్న కపాలం యొక్క లలాట క్షేత్రం మీది లిఖితాన్ని మరొక తూరి తీక్షణంగా పరీక్షించి చూశాడు.*

"‥ ‥ ‥ ‥ ‥ ‥
సముద్ర తీరే మరణం
కించిత్ భోగే భవిష్యతి"

"సందేహం లేదు! ఇది విరించి వ్రాతే!!" అని స్వగతంగా పదే పదే అనుకున్నాడు కలిప్రియుడు ఆయన ఫాల భాగంలో వికటించిన భ్రుకుటి 'వికటించిన విరించివ్రాత' అన్న ఆయన మనోభావాన్ని ప్రతిబింబించింది ఈ చతుర్ముఖుడు తన భుజ స్కంధాలపై నున్న సృష్టి కార్యపు భారాన్ని భరించ లేక పోతున్నాడా? వార్ధక్యంతో సామర్ధ్యము తగ్గి పోతున్నాడా? లేకపోతే ఒక అభాగ్యుడికి కీర్తి అనే ఎండమావిని చూపి, జీవితమంతా వేధించి, పాప భూమి అయిన విశాఖపట్టణపు సముద్ర తీరంలో జీవితం అంతమొందించి, మరణానంతరం కించిత్ భోగం ప్రసాదిస్తాడా? బ్రహ్మ మానస పుత్రుడు, వేద వేదాంగ పారంగతుడు, దేవర్షి అయిన నారద మహాముని నిశితమయిన మేధకి యీ కుతర్కంలోని అంతరార్ధం అర్ధం కాలేదు లేకపోతే 'కించిత్ భోగే భవిష్యతి'ట! చతుర్ముఖునితో ముఖాముఖీ తేల్చుకోవలసిన విషయం యిది సరాసరి స్వర్గానికి ప్రయాణ మయేడు నారదుడు

*　　*　　*

భక్తి మాట భగవంతుడికే తెలియాలి. యుక్తిగా మాత్రం యాత్ర పూర్తి చేసికొని అభీష్ట సిద్ధికి ఎదురు చూస్తున్నాడు లక్ష్మణరావు తల నీలాలని స్వామికి ముడుపు చెల్లించేడేమో, తలకి పెద్ద పాగా చుట్టేడు

"సీవీరామన్‌లా వున్నావోయ్!" అన్నారు కొందరు సహోద్యోగులు. మనస్సులో మురిసిపోయేడు లక్ష్మణరావు పోలిక కుదిరింది గనుక అదృష్టం కూడ పలికితే, నోబెల్ బహుమానం కాకపోయినా, కనీసం భట్నగర్ ఎవార్డ్ అయినా రాకపోతుందా అనుకున్నాడు లక్ష్మణరావు

ప్రముఖులతో పోల్చి చూసికొనడం రావుగారి హాబీలలో ఒకటి సంస్కారం లేకుండా, పుడతలు పీకిన తాటి టెంకలా వున్న జుత్తుని చూసి ఏవరో పొరపాటున 'ఐన్‌స్టయిన్' క్రాఫింగులా వుందన్నారుట నాటి నుండి కేశ సంస్కారానికి స్వస్తి వాచకం పలికేరు లక్ష్మణరావు తెరచాప ఎత్తి పడవని నడపడం అంటే ఐన్‌స్టయిన్‌కి వల్లమాలిన సరదా అత్తారింటికి అమలాపురం వెళ్ళినప్పుడు గోదావరిలో పడవ నడపడం ప్రేక్టీసు చేశాడు చావు తప్పి కన్ను లొట్టపోయినంత పని అయింది పోనీ ఫిడేలు వాయిద్యంలో ప్రావీణ్యత సాధిద్దామని ప్రయత్నం చేశాడు ఐన్‌స్టయిన్‌కి మల్లే 'బాక్' వాయించలేకపోయినా అపస్వరాలతో సరళీస్వరాలు వాయించేవాడు తను సాధకం చేస్తూ వున్నప్పుడల్లా భార్యామణి వీధి గుమ్మంలో కూర్చునేది. ఉండబట్టలేక అడిగాడు.

"నేను ఫిడేలు వాయిస్తూ వుంటే వీధిలోకి పోతా వెందుకూ ?"

"పెళ్ళాం కొట్టటం లేదని పొరుగువాళ్ళకి హామీ యిస్తున్నానండీ!"

పురిటిలోనే సంధి కొట్టినట్లు ఫిడేలు వాయిద్యం యిలా బెడిసికొట్టింది ఏకలవ్యుడిలా గురువుగారి ఫొటో ఒకటి ఎదురుగా పెట్టుకొని 'పైపు' తాగడం ప్రేక్టీసు చేశాడు సిరి అబ్బక పోయినా చిడుము అబ్బిందంటారే అలాగ లక్ష్మణరావు గారికి చివరకి పైపు అలవాటు మిగిలింది

ఈ కీర్తి కండూతి లక్ష్మణరావుని పసితనం నుండి పీడించడం మొదలుపెట్టింది పరసురామా లయన్ సర్కస్‌వారు బంతుల బీడులో డేరాలు ఎప్పుడు ఎత్తేస్తారా అని ఎదురు చూసేవారుట రావుగారి తల్లిదండ్రులు ఊళ్ళో వున్న వూర కుక్కలన్నీ వాకిట్లోనే సర్కస్ చేస్తూవుంటే ఎన్నాళ్ళని భరిస్తారు ? ఏ నాగేశ్వరరావులాగో, ఎన్టీయార్ లాగనో అయిపోదామని ఎంతగా కలలు కన్నాడో! పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే మక్కెలు విరగ్గొట్టి పులుసులోకి ముక్కలు లేకుండా చేస్తానని తండ్రి బెదిరించేసరికి లక్ష్మణరావు దృష్టి చదువు మీదికి మరలింది

'యమాతా రాజభానస' అని పెద్ద తెలుగు మేష్టారు బోర్డుమీద వ్రాసేసరికి మనవాడి జేబులో నుండి కవిత్వం ఆకులులా పెల్లుబుకి వచ్చిందనడానికి ఆస్కారం లేదుకాని లక్ష్మణరావు దృక్పథంలో కొంత మార్పు వచ్చింది చదువు సంధ్యల మీదికి దృష్టి మరలింది పద్యాల మీద ప్రయోగాలు చేసేవాడు సర్కస్‌లో ఏనుగు మీద పెద్ద పులి సవారీ చేసిన ఘట్టాన్ని వర్ణించడానికని మత్తేభ, శార్దూల విక్రీడితాలని మేళవించి 'మత్త శార్దూలం' అనే కొత్త రకం పద్యాన్ని వ్రాశాడు రావు సనాతనుడయిన తెలుగు మేష్టారు మండి పడ్డారు "ఒరే! రావూ!! నీకు పద్యాలు రావురా!" అని ప్రాసకోసం పాకులాడుతూ తల వాచేలా చివాట్లు వేశారు త్రివేణి, భారతి వంటి పత్రికలు కూడ ఏమి ప్రోత్సాహం చూపలేదు "ది అన్ పబ్లిష్డ్ వర్క్స్ ఆఫ్ ది గ్రేట్ లేట్ లక్ష్మణరావు" అని ఎవరయినా ప్రచురించకపోతారా అని ఖరాబయిన కాగితా లన్నిటిని భావితరాల వారికొరకు ఫైలు చేసి భద్ర పరిచేడు

లక్ష్మణరావు దృష్టిలో బాహ్య ప్రపంచం నుండి ఆత్మ ప్రక్షాళన కొరకు లోనికి తిరిగింది బాడవ తోటలో కొబ్బరిచెట్టు కింద కూర్చొని, పద్మాసనం వేసి 'బుద్ధం శరణం గచ్ఛామి' అన్నాడు మనస్సు నిలకడగా వుండటం లేదు పరి పరి విధాల పరిగెడుతున్నాది

పసందయిన పొడి అక్షరాల పేరు లేకపోబట్టే తన వ్రాతలు బుట్టపాలవుతున్నాయి శ్రీశ్రీ, సినారె, కరుణశ్రీ వగయిరాలంతా ఖ్యాతి గడించడానికి కారణం వారి కవిత్వంలోని పటుత్వమేనా ? శ్రీశ్రీకి వాళ్ల నాన్న 'పెంటబ్బాయి' అని పేరుపెట్టివుంటే మనకి శ్రీశ్రీ వుండేవాడే కాదు పిల్లల భావికి తల్లిదండ్రులు మంచి పేరుతో పునాదులువెయ్యాలి ఈ మాత్రం ముందు చూపు లేకపోయిన తల్లిదండ్రులమీద కోపం వచ్చింది లక్ష్మణరావుకి.

కనీసం 'రామారావు' అనేనా పెట్టేరు కాదు లక్ష్మణుడు ఎప్పుడూ రెండవ వాడే! ఇలా ద్వితీయ స్థానంలోపడి రాటవమని తన తల్లిదండ్రులు తనని శపించేరా ? పేరంటే తల్లిదండ్రులు పెట్టేరు ఇంటి పేరు సంగతి ? మందపాటి! ఇంకానయం మందకొడి అనలేదు ఇటువంటి దీనావస్థలో వున్న తన పేరుని సుందరీకరించడం ఎలా ? కరుణశ్రీ నుండి వెధవశ్రీ వరకు వున్న పేర్లన్నీ గాలించి చూశాడు మందపాటి లక్ష్మణరావుని 'మందశ్రీ' అంటే! ఛా ఛా!! చాల 'డల్'గా వుంది పోనీ పేరు లోని పొడి అక్షరాలకి శ్రీ చేర్చితే! మలశ్రీ! హరి హరీ!! లక్ష్మణరావుని 'లక్ష్మణ', 'రావు' అని విడగొట్టి, పొడి అక్షరాలు తీసికొంటే 'మలరా' అయింది కలరా లా వుంది. ఒళ్లు మండింది

ఇలా ఆత్మ ప్రక్షాళనం చేసికొంటూ వున్న లక్ష్మణరావుని బాహ్య ప్రపంచంలోకి యీడుచుకొని వచ్చింది నేలమీద పడ్డ నారికేళం చుక్కలో తప్పి పోయింది కాని కపాలమోక్షం జరిగి పోయి ఉండేది శరీరం గగుర్పొడిచింది భర్తృహరి సుభాషితం ఒకటి తళుక్కున మనస్సులో మెరిసింది దైవోపహతుడు తాటిచెట్టు నీడని సేద దీర్చుకొనేందుకు వెళితే తాటికాయ నెత్తిమీద పడిందట నారికేళం నెత్తిమీద పడలేదు కనక తను దైవోపహతుడు

## పై వారమే
## హాస్య సంచిక

కాడు! లక్ష్మణరావుకి మనోవికాసం కలిగింది నిర్మాణాత్మకంగా ఆలోచించటం మొదలుపెట్టేడు

వెధవకాయ! కిందకి ఎందుకు పడాలి ? ఇది 'భగవదేచ్ఛ' అని అనడానికి వీల్లేదు పుట్టినవాళ్లంతా మహానుభావు లవుతున్నారా ? అలాంటప్పుడు చెట్టు కాయలన్నీ కిందకే ఎందుకు పడాలి ? కొన్ని ఆకాశం లోకి ఎందుకు ఎగిరిపోవు ? అయస్కాంతం ఇనుమును ఆకర్షించినట్లు భూమికాని వస్తువులని ఆకర్షిస్తున్నాదా? మరయితే సూర్య, చంద్ర, గ్రహ, నక్షత్రాదులు భూమిమీద ఎందుకు పడిపోవటం లేదూ ? గెలిలియో, కెప్లర్, న్యూటన్‌లు ముగ్గురు కలిసి సాయంపట్టిన విషయం తన బుర్రలోనే పుట్టిందని నెత్తి, నోరూ బాదుకున్నా ఎవరూ నమ్మలేదు

తను యిలా నలుగురిలోను నవ్వుల పాలు అవడానికి కారణం ఏమిటో ఇంటరులో జేరిన తర్వాత గాని తెలిలేదు ఆర్కిమిడీస్, గెలిలియో, న్యూటన్, ఎవగాడ్రో గేలుసాక్, బెల్‌జీయిస్ యిలా పుంఖాను పుంఖాగా హేమా హేమీల గురించి తెలిసి కోవడం మొదలు పెట్టేడు అంతేకాదు లక్ష్మణ రావుకి సైన్సు బాగా వంటపట్టడం మొదలయింది మొదటి తరగతిలో పుత్తీర్ణు డవుతూ యూనివర్సిటీలో కూడ చదువు పూర్తి చేశాడు

యూనివర్సిటీ వాతావరణంలో లక్ష్మణరావు వైజ్ఞానిక జ్ఞానం వికసించి పరిమళించింది పుస్తకాలని చెదపురుగులా తినేసేవాడు పరీక్ష లన్నింటిలోను ఫస్టు మార్కులు రాకపోయినా ప్రపంచ జ్ఞానం బాగా పెంచుకున్నాడు కాలం, కర్మం కలిసి వస్తే కీర్తి కక్కు వచ్చినట్లు ఒద్దనుకున్నా వస్తుందనే నీతి పాఠం నేర్చుకున్నాడు ఉదాహరణకి కెప్లర్ గ్రహాల గతులమీద చేసిన లెక్కలలో లర డజను తప్పులు కనిపించేయి లక్ష్మణరావు నిశితమయిన నేత్రాలకి! కెప్లర్ అదృష్టం తన్నుకొచ్చింది కనక తప్పులు ఒకదానిని మరొకటి రద్దుచేసేశాయి!

'ఐన్‌స్టీనియమ్', 'ఫెర్మియమ్' అలా తన పేరు ఒక మూలకానికి పెడితే ? నూట అయిదవ మూలకం కాని తను కనిబెడితే 'మలేరియం' అని పెట్టవచ్చు! సైక్లోట్రానులు, ఏక్సిలిరేటర్లు లేకుండా యీ పని తన తరమా! పోనీ! ఒక తోక చుక్కని కనిపెడితే! తోకచుక్క చీదేసిన సిసింద్రీలా తుస్సుమన్నా కహూటెక్ పేరు ప్రపంచం నాలుగు మూలలా మోగిపోయిందే! అబ్జర్‌వేటరీలో దూరదర్శినితో ఆకాశాన్ని గాలించి చూసేవాడు

పేరు చరిత్రలో చిరస్థాయిగా నిలవడానికి మరొక మార్గం వుంది ఒక సిద్ధాంతాన్ని లేవదీయాలి ఈ సిద్ధాంతం ఎలా వుండాలంటే యిది తప్పనో, ఒప్పనో రకీమని బుజువు చెయ్యడానికి వీలుపడకూడదు ఉదాహరణకి దేముడు లేడని వాదించే నాస్తికులు ఏమంటారు ? "ఏదీ దేముడు వున్నాడని రుజువు చెయ్యి!" అంటారు దేముడు లేడని వాళ్లు రుజువు చెయ్యకలరా ? అలాగన్న మాట లక్ష్మణరావు యీ ఐడియాని బాగా తరచి తరచి గాలించి చూశాడు కాని యిటువంటి వూహాలు, సిద్ధాంతాలు లక్ష్మణరావు ఎన్ని ప్రతిపాదించినా ఒక్కటీ బలం పుంజుకోలేదు తను అన్నమాటే ఏ ఐన్‌స్టయినో అని వుంటే అది యీపాటికి వేదం అయిపోయి వుండేది శ్రీకృష్ణుడు చేస్తే లీల అదే సితన్న చేస్తే మరొకటి!

చదువు పూర్తి అవగానే లక్ష్మణరావు ఎదురు చూస్తూవున్న స్వతంత్రం వచ్చింది పరీక్షలు, ఫస్టు మార్కులు, హోమ్ వర్కులు, యీ బాదరబందీ నుండి బయట పడ్డాడు ఆర్థికంగా ఒకరి మీద ఆధారపడవలసిన రోజులు కూడ దాటి పోయాయి పంజరంలో నుండి బయిటపడ్డ పిట్టలా వుంది ఆయన జీవితం తనకి యిష్టం వచ్చిన ప్రయోగాలు చేసికోవచ్చు!

నెల్లాళ్ళు తిరిగేసరికి పెరట్లో చిన్న ప్రయోగ శాల వెలిసింది "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అన్నట్లు లక్ష్మణరావుగారు చవిచూడని సబ్జక్టు అంటూ లేదు భౌతిక, రసాయనిక, భూగర్భ, ఖగోళ, జీవ శాస్త్రాలన్నీ కుణ్ణంగా చదివి అర్థం చేసికొన్నాడు ఊళ్ళో వున్న శాస్త్రుల్లుగారి దగ్గర వేదం నేర్చుకోవడం మొదలు పెట్టేడు భారత దేశాన్ని మనవాళ్ళు 'జంబూ ద్వీపం' అని ఎందుకు అన్నారు ? ఆసేతు హిమాచల పర్యంతాన్ని వాల్మీకి కళ్ళకి కట్టినట్లు రామాయణంలో ఎలా వర్ణించ గలిగేడు ? ఆ రోజులలో రహదారులు, ప్రయాణ సౌకర్యాలు లేవుకదా ? పునర్‌జన్మ సిద్ధాంతం నిజమయితే ప్రపంచంలో ప్రజలు పాపం పెరిగినట్టు ఎందుకు పెరిగిపోతున్నారు ? హస్త సాముద్రికానికి సైంటిఫిక్ బేసిస్ ఏదయినా వుందా ? అథర్వణ వేదంలో ఏటం బాంబులు నిజంగా వర్ణించేరా ?

(28వ పేజీ చూడండి)



''మంచి మనుషులు''లో మంజుల

## హీరో వెంకటరత్నం

జగపతి పిక్చర్స్‌వారి ఈస్ట్‌మన్ కలర్ చిత్రం 'మంచి మనుషులు'' చూసిన ప్రతి వ్యక్తి ఎక్కువగా మెచ్చుకొన్నది, ఎస్. వెంకటరత్నం పనితనాన్ని. కాశ్మీరు సుందర దృశ్యాలయితేనేమి, సిమ్లా సింగారాల్వయితేనేమి అత్యంత సహజంగా తీసినట్టు పేర్కొన్నారు. శోభన్‌బాబు యింత అందగాడా అనిపించేంత సొగసు అతడి ముఖ వర్చసులో కనిపించిందట. ముఖ్యంగా క్లయి మాక్సు దృశ్య చిత్రీకరణలో వెంకటరత్నం విశేషంగా కనిపించారట. కాబట్టి చిత్రానికి వెంకటరత్నం మొదటి హీరో అని చెప్ప

### రామారావు వేసే మరో రసమయమైన పాత్ర

హిందీ భాషలో విజయభేరి మ్రోగించిన ''జంజీర్'' చిత్రం ఆధారంగా రవి చిత్ర ఫిలిమ్స్ అధినేత వై. వి. రావు ''నిప్పులాంటి మనిషి'' చిత్రాన్ని నిర్మించారు. టైటిల్ పాత్రకు రామారావునే ఎందుకు ఎన్నుకున్నారని ప్రశ్నించినందుకు వారిలా సమాధాన మిచ్చారు. ''ఇన్‌స్పెక్టర్ విజయ్ పాత్ర ఎంతో క్లిష్టమైనది. విశిష్టమైనది. [illegible] పోయినాసరే నీతిని, నిజాయితీని

# ''కథానాయకుని కథ''

ఆ రోజు శుక్రవారం ఉదయం ఆరు గంటల సమయం. బజుల్లా వీధి నెంబరు అరవైమూడు గేటు వద్ద వందలాది జనం. తమ అభిమాన కథానాయకుడి దర్శనార్థం ఆంధ్రదేశం నుండి వచ్చిన పుదంతం.

సరిగ్గా ఆరు గంటలా పది నిమిషాలకు గేటు తెరిచారు. వాళ్ళ వేయి కళ్లతో ఎదురు చూచిన తారక రామయ్య ప్రత్యక్షమయ్యారు. తను చూడ వచ్చిన ప్రతి వ్యక్తికి నమస్కరించారు. కొందరు కరచాలనం చేశారు. మరి కొందరు పాదాభివందనం చేశారు. అప్పుడు నాకు అసలు నిజం స్ఫురించింది.

> ఎన్. టి. ఆర్. తో
> శ్రీనివాస్ యింటర్‌వ్యూ

ఇప్పటికీ నందమూరిపై ప్రజలకు విపరీతమైన ప్రేమ, అభిమానం వున్నదన్న విషయం బోధపడింది.

ప్రజల దృక్పథంలో ఏమాత్రం మార్పు లేదని ఎన్టీఆర్ నాతో అన్న మాటలు సత్య దూరం కాదని యిటీవల విడుదలయిన ''జయసింహ, కోడలు దిద్దిన కాపురం'' చిత్రాల వసూళ్ళు నిరూపించాయి.

### మంచి - చెడు

మంచిని మంచిగా, చెడును చెడుగా పరిగణించి ఆ తారతమ్యాన్ని బట్టి చిత్రాలను జనం ఆదరిస్తారు అన్న రామారావుగారి వాదం అక్షరాలా నిజం అని ప్రజలు యిస్తున్న తీర్పు ధృవపరిచింది.

చిత్రాల నిడివి ప్రసక్తి వచ్చినప్పుడు ఆయన చెప్పిన మాటలు యదార్థం అనిపించింది. ''హృదయాన్ని స్పందింపచేసే కథ అయినప్పుడు, నిడివిని గూర్చి ఆలోచించే వ్యవధి రసజ్ఞులకు వుండదు.



''నిప్పులాంటి మనిషి''లో

ఉమ్మడి కుటుంబం, కోడలు దిద్దిన కాపురం'' చిత్రాలు నిరూపించాయి.

హీరోకి నటరత్న యిచ్చిన నిర్వచనం : ''కథను ఏ పాత్ర అయితే నడిపిస్తుందో, కథకు జీవనాడిగా ఏ వేషం అయితే వుంటుందో, అట్టి భూమికను ధరించే నటుడే కథానాయకుడు, హీరోయిన్‌కి భర్త



''కథానాయకుని కథ''లో

గానో లేక ప్రియుడిగానో నటిస్తేనే హీరో అనుకోవడం సమంజసము కాదు.''

నటుడన్న తర్వాత ఏ పాత్ర నైనా పోషించడానికి సంశయించకూడదు. పోషించే పాత్రలో ప్రజను మెప్పించ కలిగినవాడే నిజమైన కళాకారుడు అనేది ఆయన సిద్ధాంతం అక్షరాలా నిజం అని ఆయన నటించిన జానపద, పౌరాణిక, సాంఘిక, చారిత్రాత్మక పాత్రలు ఋజువు చేశాయి.

నటుడ్ని తపస్వి అంటారాయన. నిజమే. నిష్ఠతో, నియమంతో, నిగ్రహంతో పాత్రను పోషించినప్పుడే, ఆ పాత్రలో పవిత్రత వస్తుంది. ముఖ్యంగా నటుడి స్థితిని పరకాయ ప్రవేశంతో పోల్చవచ్చు. ధరించే వేషంలో తను ప్రవేశించి, ఆ పాత్రగా రూపం దాల్చి, జీవం కూరడం తపస్సుతో సమానం కాదా అనేది ఆయన ప్ [illegible] ఆమోద యోగ్యమే.

డంలో సంశయం పనిలేదు.

దర్శకుడు రాజేంద్రప్రసాద్ తన చాతుర్యాన్ని చూపెట్టి, చిత్రాన్ని ఆద్యంతం రక్తి కట్టించారట. పాటల చిత్రీకరణలో ఆయన అసాధారణ ప్రజ్ఞ కనిపించిందట. ఎక్కడా విసుగు జనించకుండా ఆయన కథను నడిపించారట. చిత్రానికి మరొక హీరోగా రాజేంద్రప్రసాద్‌ను పేర్కొనాలి.

సంగీతం గూర్చి వేరే వ్రాయ పనిలేదు మహదేవన్‌కి మార్కెట్టులో ఒక పేరుంది. జగపతి పిక్చర్స్‌కి ఆయన ప్రత్యేకంగా కృషి చేస్తారన్న వదంతి నిజమేనేమో? అన్ని పాటలు బాగున్నాయట.

నటన విషయానికి వస్తే శోభన్, జగ్గయ్య, మంజుల పోటీపడి నటించారట. నాగభూషణం ధరించిన పాత్రలో వెరైటీ వున్నదట. మాస్టర్ టిట్టో యీ చిత్రానికి అదనపు ఆకర్షణ. జగపతికి మరొక విజయాన్ని తెచ్చిపెట్టే చిత్రం యిది.



''ఇంటింటి కథ''లో కృష్ణ, చంద్రకళ

పరిత్యజించడ... ...యి. న్యాయం, ధర్మం, సత్యం అనే పదాల విలువను అకృత్యాలమూలంగా ఖరాబు చేస్తున్న దుండగులకు ఎదురు నిలిచి, వారి బెదిరింపు లను ఖాతరుచేయక, బెబ్బులిగా వార్ని వెంటాడి బంధీ చేసిన ధీరుని పాత్ర ఇన్‌స్పెక్టర్ విజయ్‌ది. ఈ పాత్రకు రామారావుగారు తప్ప మరొకరు న్యాయం చేయలేరన్న నిజాన్ని నే నొక్కడినే కాదు, ప్రేక్షకులు కూడా ఘంటాపథంగా చెప్తారు అన్నారు వై. వి. రావు. ఇలాంటి పాత్రలను పోషించడం వెన్నతో పెట్టిన విద్య రామారావుకు అని మరోసారి దృఢ పరుస్తుంది ''నిప్పులాంటి మనిషి'' చిత్రం.

### లాల్ ద్వయం

లత, దేవిక, రాజబాబు, సత్యనారాయణ, రేలంగి ముఖ్య పాత్రలను పోషించిన ఈ చిత్రానికి యస్. డి. లాల్ దర్శకత్వాన్ని, యస్. యస్. లాల్ ఛాయాగ్రహణాన్ని చేపట్టడమే కాకుండా ఓ పట్టు పట్టారు. సత్యం ''స, రి, గ, మ''లో సరికొత్త దనన్ని కన్పిస్తుంది.

### వయసొచ్చిన పిల్ల

ఇటీవల మద్రాసు మహా నగరంలో వెలసిందొక నూతన చిత్ర నిర్మాణ సంస్థ. పేరు కృషీవల ఫిలింస్ ప్రైయివేటు లిమిటెడ్. ఈ సంస్థ రూపొందిస్తున్న చిత్రం పేరే ''వయసొచ్చిన పిల్ల''. సెప్టెంబరులో షూటింగ్ ప్రారంభ మౌతున్న ఈ చిత్రంలో లక్ష్మి, చంద్రకళ, జి. వరలక్ష్మి, నిర్మల, కె. విజయ, డా. ప్రభాకరరెడ్డి, పద్మనాభం, అల్లు రామలింగయ్య, గిరిబాబు, శరత్‌బాబు, కాకరాల, పి. జె. శర్మ, రవికాంత్, కె. కె. శర్మ, శ్యామ్‌బాబు మున్నగువారు ముఖ్య భూమికలను పోషిస్తున్నారు.

ఆర్. వెంకటరెడ్డి సమర్పణలో కోటపాటి మురహరిరావు, పెరుగు రామిరెడ్డి నిర్మిస్తున్న ఈ చిత్రానికి లక్ష్మీదీపక్ దర్శకుడుగానూ, టి. చలపతి రావు సంగీత నిర్దేశకుడిగానూ, జి. వి. సుబ్బారావు కళా దర్శకుడిగానూ, శేఖర్ – సింగ్ ఛాయాగ్రాహ కుడిగానూ పని చేస్తున్నారు.

చిత్రం పేరునుబట్టి కథ అంతా ఒక స్త్రీని చుట్టి నడుస్తుందని, వయసొచ్చిన పిల్లకు వచ్చే నిర్బంధాలు, నిందలు ఎలా వుంటాయని నిదర్శన పూర్వకంగా నిరూపింప బడుతుందని తెలుస్తోంది. విజయా పంపిణీ చేసే ఈ చిత్రం వెరైటీగా వుండ గలదని మకుటం నిర్ధారణ చేస్తోంది.



చెప్పదలచిన భావాన్ని సూటిగా వివరించినప్పుడు, ఆ సన్నివేశం పండుతుంది. అలా గాక తోమడం మొదలెడితే, థియేటర్లో కూర్చోలేక, అందరినీ తిట్టుకుంటూ మూడు గంటలు గడపడం జరుగు తుంది'' అన్నారాయన.

### సమస్యల కథ

ఏదేని ఒక సమస్యను కథావస్తువుగా తీసుకుని, దానిని పరిష్కరించే మార్గాన్ని సందేశాత్మకంగా చూపగలిగితే, అట్టి చిత్రానికి ప్రజామోదం లభిం చడం తథ్యము అనేది ఆయన అభిప్రాయము ''నిజము నిజము'' అని ఆయన నిర్మించిన ''వరకట్నం,

కృష్ణుడు, రాముడు, రావణాసురుడు, దుర్యో ధనుడు, బృహన్నల, శివుడు, ఇంద్రజిత్తు, బ్రహ్మయ్యనాయుడు పాత్రలను పోషించినప్పుడు మనకి ఎన్టీ రామారావు కనిపించక, ఆ పాత్రలుగా అగుపించారంటే ఆయన ఎంత భక్తి, శ్రద్ధ, శ్రమ చూపెట్టి యుండాలి?

### అక్కినేని ప్రశంస

యావత్ప్రపంచం గర్వించదగిన వుత్తమ నటుడు మన రామారావు అని 'నటసామ్రాట్' నాగేశ్వరరావు అనగలిగారంటే, ఎన్టీ ఆర్ ఎంత గొప్ప నటుడై యుండాలి.

కృష్ణుడి పాత్ర ధరించడం సులభమా? రాముడి పాత్ర పోషించడం సుఖమా? అన్న ప్రశ్నకు ఆయనిచ్చిన సమాధానం.

లౌక్యం వున్న పాత్ర కృష్ణుడు. క్లిష్టమైన వేషం. నటించడానికి కష్టం తక్కువ. రాముడి పాత్రలో ప్రశాంతత, పరిశుభ్రత, పరిపక్వత వున్నాయి. నటించడానికి కష్టం ఎక్కువ. కృష్ణుడి కన్నా రాముడి పాత్రను పోషించడం తనకు ఎక్కువ యిష్టం అన్నారాయన.

చిరంజీవి. బాలకృష్ణ భవిష్యత్తును ప్రశ్నిం

(26 వ పేజీలో)



''దేవుడు చేసిన పెళ్లి''లో శారద, శోభన్‌బాబు



"దీర్ఘ సుమంగళి"లో జయసుధ

(25వ పేజీ నుంచి)

చాను. వృద్ధిలోకి వస్తాడన్న నమ్మకం తనకు వున్నట్టు చెపుతూ, అతడి విద్యకు ఆటంకం రాకుండా, వృత్తికి భంగం కలగకుండా ఒక పథకాన్ని ఆలోచిస్తున్నట్టు చెప్పారు.

## ఆనంద పారవశ్యం

"తండ్రిని మించిన తనయుడు" అవుతాడు బాలకృష్ణ అని నేను అన్నప్పుడు ఆయన గంభీరంగా యిచ్చిన సమాధానం నన్ను ఆశ్చర్య చకితుడ్ని చేసింది.

తన కుమారుడు ప్రయోజకుడు అవ్వాలని, అందరిచేత మంచివాడు అనిపించుకోవాలని ప్రతి తండ్రి కోరుకుంటాడు. తండ్రికన్నా తనయుడు గొప్పవాడవుతాడు అని సహృదయులు ఆశీర్వదించినప్పుడు, అంతకన్నా మించిన ఆనందము, ఆస్తి మరొకటి వుంటుందా ?

అభిమాన సంఘాల వల్ల మంచి జరుగుతుంది అనెడి నమ్మకాన్ని ఆయన వ్యక్తపరుస్తూ, పర దూషణ చెయ్యకుండా, సభ్యతా సంస్కారంతో ప్రవర్తిస్తే అభిమానుల గౌరవం పెరుగుతుంది, వాళ్ల హృదయాలలో కళాకారుడికి శాశ్వతమైన స్థానం దొరుకుతుంది, అన్నారాయన.

కథను బట్టి పాత్రధారులను ఎన్నిక చెయ్యాలే గాని, పాత్రధారులను అనుకుని కథ రాయడం మంచి పద్ధతి కాదు అన్నారాయన. ఒక చిత్రానికి కథ ఎంత ముఖ్యమో, ట్రీట్‌మెంట్ గూడా అంతే ముఖ్యము అన్న ఆయన వాక్యాలు ఎన్. ఏ. టి. చిత్రాలలో కొట్టొచ్చినట్టు కనిపిస్తాయి.

"దాన, వీర, శూర, కర్ణ" చిత్రంలో మూడు పాత్రలను మీరే పోషించాలా అని ప్రశ్నించాను. నాకు అలా చెయ్యాలని లేదు అని చెప్పి ఆ స్క్రిప్టులో కొంత భాగాన్ని చదివారు.

## పాత్రల విశిష్టత

కృష్ణుడి సంభాషణలను, కర్ణుడి సంభాషణలను, దుర్యోధనుడి వాక్యాలను ఆయన నోటంట విన్న తరువాత హృదయపూర్వకంగా నమస్కరించి ఆ మూడింటికీ ప్రాణం పొయ్యగల శక్తి మీకు తప్ప మరొకరికి లేదు... రాదు అని అభినందించాను.

ఆయన నిర్మించబోయే చిత్రా లన్నిటికీ డైలాగులతో సహా సిద్ధంగా వున్నాయన్న నిజాన్ని కళ్లారా చూశాను.

శ్రీరామ పట్టాభిషేకం ఒక మధుర చిత్ర కావ్యంగా రూపొందించడానికి, చాణక్య శపథం ఒక మరపురాని చిత్రంగా నిర్మించడానికి, తమ్ముడి పెళ్లి—మామ భరతం ఒక రసమయ చిత్రంగా తీయడానికి నటరత్నకు ఆ ఏడు కొండలవాడు అండగా నిలిచి, విజయం చేకూర్చాలని ప్రార్థిస్తున్నాను.

## తండ్రి యానతి పాలించే ధర్మ తనయులు

స్వర్గీయ జగన్నాధరావుగారికి నలుగురు కుమారులు. వాళ్లను చాలా జాగ్రత్తగా, క్రమశిక్షణగా, నియమబద్ధంగా పెంచారు. ఐకమత్యమే మహా బలము అనెడి ధర్మసూత్రం నలుగురిలో నూరిపోసి, ఆయన కన్నుమూశారు. ఒక మంచి మనిషి రాలి పోయారు.

తండ్రి యానతి పాలించే ధర్మ తనయులయ్యారు. వారి పేర్లు : చంద్రకుమార్, విజయకుమార్, జీవన్‌కుమార్, మరియు రామకుమార్.

ఈ నెల 14 న, ఎన్. వి. ఎస్. ఫిలింస్ వారి కొత్త చిత్రం పాట రికార్డింగుతో విజయా గార్డెన్‌లో ప్రారంభమైంది. "నటరత్న" రామారావు, వారి తమ్ముడు త్రివిక్రమరావు పూజలో పాల్గొన్నారు. జగన్నాధరావుగారికి రామారావుగారంటే ఎనలేని ప్రేమ అభిమానాలు. ఆయనంటే నటరత్నకు చాలా యిష్టం. ఆయన చిత్రాలన్నిటా రామారావు నాయకుడు.

తండ్రి ఛాయా చిత్రానికి నలుగురూ ప్రణమిల్లిన దృశ్యాన్ని చూచినప్పుడు అందరి కళ్లూ చెమ్మగిల్లాయి. వాళ్లకు శుభం చేకూరాలని తారక రామారావు ఆ భగవంతుడ్ని ప్రార్థించారు.

అక్టోబరులో ఆరంభం కాబోయే ఈ చిత్రానికి విజయనిర్మల దర్శకత్వం చేపట్టింది. నాయికగా ఆమె, నాయకుడిగా కృష్ణ నటిస్తున్నారు.

ఎన్.వి యస్. ఫిలింస్ రికార్డింగు సందర్భంలో తండ్రికి ప్రణమిల్లిన తనయులు





"ధనవంతులు—గుణవంతులు"లో సత్యనారాయణ, దేవిక

## జోరుగా సాగుతున్న జయంతి జీవితం

ఇటీవల జయంతిని కలిశాను. ఎలా వుందండి మీ పయనం అన్నాను. తృప్తిగానే వుందండి జీవిత విధానం అని బదులిచ్చింది. మనకున్న కొద్దిమంది ప్రతిభ గల తారల్లో జయంతి ఒకరు అనడానికి సందేహం లేదు. రాదుకూడా. ఎందుకంటే? ఆవిడ సమ్మతించే పాత్రలు కాస్త, కూస్త వైవిధ్యంగానే వుంటాయి. ఒప్పుకున్న పాత్రను మెప్పించే నటనా కౌశలం వుండనే వుంది. అందుకే ఈ క్రింది చిత్రాల్లో ఆవిడ రకరకాల రసవత్తర పాత్రలను పోషిస్తున్నది. "జీవితాశయం", "అమ్మ మనసు", "భాగస్తులు", "చిన్ననాటి కలలు",

(47 వ పేజీ చూడండి)

"ఊర్వశి"లో శారద



వి యవాడ, శ్రీశైలం ప్రాజెక్ట్, నాగార్జునసాగర్ ప్రాజెక్ట్ ప్రాంతాలలోనూ, కృష్ణా గోదావరి లంకలలోనూ చాలామంది చూసే ఉంటారు - నక్షత్రాలవలె తెల్లని 'చిన్న చేమంతి' మొగ్గల వంటి పూలతో యెక్కడబడితే అక్కడ పెరిగే పిచ్చి మొక్కను. ఆకులు చూడ్డానికి 'మాచిపత్రి'లా కాస్త పెద్దవిగా ఉంటాయి. ఇటీవల విజయవాడలో పువ్వు లమ్ముకునేవారు యీ మొక్క ఆకులను పూలతో ఉన్న చిగుళ్ళను మాచిపత్రికి బదులు మల్లె, జాజి పూల దండల్లో కట్టి 'పాతిక సైజులకు పది మూరం' లంటూ పోటీలు పడి అమ్ముతున్నారు. ఈ మొక్కను వృక్ష శాస్త్రజ్ఞుల పరిభాషలో 'పార్థినియం హిస్టిరో ఫోరస్' అంటారు. మహారాష్ట్రలో దీనికి 'కాంగ్రెస్' అని పేరు పెట్టారు! (పువ్వులు తెల్లని ఖద్దరు టోపీ పెట్టిన కాంగ్రెస్ నాయకుల తలకాయల్లా ఉంటాయి, అందుకనట!) ఇప్పుడిప్పుడే విజయవాడలో దీన్ని 'పిచ్చి మాచిపత్రి' అని పిలుస్తున్నారు.

ఈ మొక్క జన్మభూమి వెస్టిండీస్, మధ్య, ఉత్తర అమెరికాలు. ప్రస్తుతము బొటానికల్ సర్వే ఆఫ్ యిండియా, కలకత్తాలో డిప్యూటీ డైరెక్టర్‌గా పనిచేస్తున్న డా॥ టి. శ్రీ శేషగిరిరావుగారు దీనిని మన దేశంలో మొట్టమొదటిసారిగా పూనా నగరపు వీధులలో కలుపు మొక్కలా పెరగడం గమనించి ఆ విషయం 1956లో 'బొంబె నాచురల్ హిస్టరి సొసైటీ' అను వైజ్ఞానిక పత్రికలో ప్రచురించారు. అంటే, అప్పటికి కనీసం అయిదారేండ్ల క్రితమే యీ మొక్క ప్రవేశించి, అనతి కాలంలోనే 'ఇంతింతై వటుడింతయై' అన్నట్లు ఉధృతముగా పెరిగి రోడ్ల కిరుప్రక్కలా ఉన్న ఖాళీ స్థలాలన్నిటినీ పూర్తిగా ఆక్రమించుకుంది. లటు పిమ్మట యీ

# పుప్పొడిలో రోగ

యిరవై సంవత్సరాల మధ్య కాలంలో న్యూఢిల్లీతో సహా దాదాపు దేశం నలు మూలలా విస్తరించింది.

కొద్ది సంవత్సరాల క్రితం పూనాలో చర్మ రోగుల సంఖ్య రోజు రోజుకు పెరుగుతూంటే అగ్ర శ్రేణి వైద్యులు కొందఱు ఆందోళనపడి కారణాలకై వెదకడం, కృతార్థులు కావడం జరిగింది. ముఖం మీద అసహ్యకరమైన దద్దుర్లు, జలుబు చేసి, ముక్కు ఉబ్బి నీరు కారడం, కండ్లు యెఱ్ఱబడి దురద పెట్టడం, చేతులు నల్లబడి చిట్లడం మొదలైన వీటన్నిటికి 'పార్థినియం హిస్టిరో ఫోరస్' అను యీ మొక్కయే హేతువు! తేలుకు తోక చివర విషం ఉంటే యీ మొక్కకు దాని పూలలో పుప్పొడి

పాతని, కొత్తని ఒక పంచకి తీసికొని రావాలన్న ప్రయత్నం ఆయనది.

ఇన్ఫర్మేషన్ థీరీలో 'ఎంట్రోపీ' అనే భావాన్ని వుపయోగించి ప్రపంచ భాష లన్నిటికి సంస్కృతమే మాతృ భాష అని రుజువు చేస్తూ ఒక వ్యాసము, సెకండ్ లా ఆఫ్ థర్మో డైనమిక్సుని వుపయోగించి పరకాయ ప్రవేశము సాధ్యమే అని రుజువు చేస్తూ ఒక వ్యాసము, చంద్రుడు గుడి కట్టడానికి, కీచు రాయి కూతకీ, సముద్రపు హోరుకీ, వర్షం పడ డానికీ మధ్య నున్న కారణ కార్య సంబంధా లన్నిటిని పరీక్షించి, స్టేటిస్టికల్ ఎనాలిస్ చేస్తూ ఒక వ్యాసము, యిలా ఎన్నో వ్యాసాలు చాల ప్రచురించేడు. ఇవన్నీ పాప్యులర్ సైన్సు అనేవాడు.

హార్డు సైన్సులో కూడ పరిశోధనలు చేసేవాడు లక్ష్మణరావు. జీవి ఎలా పుట్టిందో, ప్రతివర్తి తలకి బలి అయి ఎలా పరిణతి చెందిందో, యీ వ్యవహారం అంతా క్వాంటం గమన శాస్త్రము వుపయోగించి వివరిస్తూ ఒక సిద్ధాంతం లేవదీశాడు. అభివృద్ధి చెందాలనే అభిలాషని, ఆర్థిక స్తోమతని ఎనర్జీతో పోల్చి, కూపస్తమాడుకంలా వున్న భారత దేశాన్ని పొటెన్షియల్ వెల్‌లో వున్న ఎలక్ట్రానుతో పోల్చి, యీ రెండింటిని శ్రోడింగర్ సమీకరణంలో ప్రతిక్షేపించి, భారతదేశం కుప్పిగంతులు వేసికొంటూ ప్రగతిపథంలో ఎలా పరిగెట్టగలదో వివరిస్తూ ఒక ఎనర్జీ లెవెల్ డయాగ్రమ్ నిర్మించేడు లక్ష్మణరావు.

ఇలా రోజుకో కొత్త ఐడియా, కొత్త రిసెర్చి ప్రపోసల్. "కౌపీన సంరక్షణార్థం అయం పటాటోప" అన్నట్లు యీ వూహ లన్నిటిని కొనసాగించాలంటే ఫండింగు, స్టాఫింగ్, ఆఫీసు స్పేసు, ఎక్విప్‌మెంటు. రిసెర్చి కాస్తా ఫేకల్టీ పోలిటిక్సుకి బలి అయిపోయేది.

ఒకనాడు వైస్ ఛాన్సలర్‌గారి దగ్గర నుండి రావుగారికి పిలుపు వచ్చింది. "మంత్రాలకి చింతకాయలు రాలతాయా" అనుకుంటూ ఎదురొచ్చిన అపశకునాన్ని లెక్కపెట్టకుండా 'వీసీ' గారి ఆఫీసుకి వెళ్ళేడు.

"మీ టేలంటు యిలా నివురు గప్పిన నిప్పులా ఈ యూనివర్శిటీలోనే రాటవడం ఏమీ బాగా లేదండీ!"

వైస్ ఛాన్సలర్‌గారి మాటలలోని అంతరార్థం అర్థం కాలేదు లక్ష్మణరావుకి. చూపుడు వేలితో పైపులోని పుగాకుని నెమ్మదిగా నొక్కి, అగ్గిపుల్ల గీసి, ప్రశ్నార్థకంగా వైస్ ఛాన్సలర్ వైపు చూశారు. "ఎటామిక్ రిసెర్చి సెంటర్‌కి మీ బేక్ గ్రవుండు వున్న మనిషి కావాలట" అంటూ ఉద్యోగా లున్నాయంటూ వచ్చిన సర్క్యులర్‌ని లక్ష్మణరావుకి అందించేరు వైస్ ఛాన్సలర్!

పని, జీతం చాల ఆకర్షణీయంగానే కనిపించేయి.

"ఈ వుద్యోగం నాకు వస్తుందంటారా?"

"ఈ విషయాలన్నీ ఆలోచించకుండా మీకు కబురు ఎందుకు పంపుతాను" అర్థ దగ్ధితంగా నవ్వేరు వైస్ ఛాన్సలర్. "ఇది మంచి ఆపర్ట్యూనిటీ. ఆలిండియా ఫేమ్ ఒచ్చే లవకాశం యిది. తెలుగువాడు వరి మొక్క లాంటివాడు. 'ట్రాన్స్ప్లేంట్' చేస్తేకాని రాణించడు. అవకాశం ఒదులుకోకండి. 'బార్క్'లో పెద్ద పెద్ద పొజిషన్స్‌లో తెలుగువాళ్ళు వున్నారు. మీ 'కేండిడసీ'ని గట్టిగా సిఫారుసు చేస్తూ నేను సేత్నాకి పెరసనల్‌గా వుత్తరం వ్రాస్తాను. ఏమంటారు?"

కాదనలేక పోయారు లక్ష్మణరావు. భాభా, సరాభాయి, సేత్నా తర్వాత లక్ష్మణరావు! అదృష్టం పిలిచినప్పుడు పలకకపోతే మరి పిలవదుట. లక్ష్మణరావు మూట, ముల్లె సర్దుకుని, సింహాచలం కొండ ఎక్కి, సీవీరామన్ లా తలకి పాగా చుట్టి, మామ్మ యిచ్చిన మాగాయ జాడీ మూటలో సర్దుకుని మెయిలు ఎక్కాడు.

బొంబాయిలో కాలు పెట్టినది మొదలు లక్ష్మణరావుగారి నసీబులో మార్పు కనిపించడం మొదలు పెట్టింది. దేశంలోని వసతులతో పోల్చి చూస్తే నక్కకీ నాగలోకానికీ ఉన్నంత తేడా కనిపించింది. నువ్వు వైదీకివంటే నువ్వు నియోగివనీ, నువ్వు కమ్మ అంటే నువ్వు రెడ్డి అనీ నిత్యం

# కించిత్ భోగే భవిష్యతి

[ 23 వ పేజీ తరువాయి ]

ముసుగులో జరిగే గుద్దులాట యిక్కడ కనిపించ లేదు.

ఏడాదిలోగా ఫిజికల్ రివ్యూలో రెండు ఆర్టికల్స్ పబ్లిష్ చేశాడు. మనిషిలో ఉత్సాహం పెల్లుబుకుతునాది. తర్వాత పబ్లికేషన్స్‌కి పంపిన ఆర్టికల్స్ సగందూరం వెళ్లి పై అధికారి టేబిల్ దగ్గర ఆగిపోయాయి. జీతం పెరిగింది. పదవి పెరిగింది. పరపతి పెరిగింది. పబ్లికేషన్‌కి పెర్మిషన్ మాత్రం రాలేదు.

రెండూ రెండూ కలిపి చూశాడు లక్ష్మణరావు. ఆయన మస్తిష్కంలో ఏదో మెరిసింది. పై అధికారిని ప్రయివేటుగా జుహూ బీచిలో కలుసుకొని తన అనుమానం వెల్లడించేడు. మవునమే సమాధానంగా వచ్చింది.

ప్రధానమంత్రి ఆఫీసు నుండి బయటకు వస్తూన్న లక్ష్మణరావు మూడంగుళాలు ఎక్కువ పొడుగ్గా కనిపించేడు పై అధికారి దృష్టికి.

'గ్రవుండ్ జీరో' దగ్గర కవుంట్ డవున్ విజయవంతంగా పూర్తి అయితే పక్కనున్న ఎర్ర టెలిఫోన్ తీసి "బుద్ధుడు పుట్టేడు" అనాలిఅంతే. ఏమయినా తేడా వస్తే "బుద్ధం శరణం గచ్ఛామి" అనాలి. అన్నీ జాగ్రత్తగా రిహార్సల్స్ వేసికొన్నాడు లక్ష్మణరావు. మూడవ నెంబరు టెస్ట్ టన్నెల్‌లో గ్రౌండ్ జీరోకి సరిగ్గా అరమైలు దూరంలో తను రహస్యంగా దాచిన మాగాయ సీసా ఏమిటవుతుందో?

పది, తొమ్మిది, ఎనిమిది, ఏడు, ఆరు, అయిదు, నాలుగు, మూడు. రెండు. ఒకటి. కాలికింద భూమి కొద్దిగా కంపించింది. గ్రౌండ్ జీరో దగ్గర కొద్దిగా ధూళి లేచింది. ఓపెన్ హైమర్‌లాగ లక్ష్మణరావుగారు కూడా గీతలో శ్లోకం ఒకటి చదివేరు. ఎర్ర టెలిఫోను ఒణుకుతూ వున్న చేతులతో తీసి ఢిల్లీకి వార్తని అందించేరు.

భూగర్భంలో పేలిన అణుబాంబు అన్ని విధాలా దిగ్విజయ మయింది. ఈ సందర్భాన్ని పురస్కరించు

# క్రిములున్న పూలం!

రూపంలో దాగి ఉంది! ఐతే యీ బాధలకు గురి ఎంటే యీ మొక్క పుప్పొడి కొందరికి 'అలర్జీ' అన్నమాట

ఏది యేమైనా, విషపూరితమైన పుప్పొడి కలిగి పిలువని పేరంటముగా 'అమెరికా నుండి దిగి వచ్చిన యీ దొరవారి'ని యెంత త్వరలో సమూలముగా నాశనము చేస్తే అంత మంచిది వీటిని కలిపి మిగత రకాల పూలతో మాలలు కడుతున్నవారికి పైన చెప్పిన రోగాలు వచ్చి బాధ పడుతున్నట్లు విజయవాడలోని పూల అంగడివారు చాలమంది ఒప్పుకున్నారు ఐనా వారు యీ మొక్క వాడకం తగ్గించకపోవడం విచారకరము ఎవరూ కొనకుండా ప్రతిఘటించినప్పుడే పూల అంగడివారు దీనిని వాడడం మానేస్తారు



ఒకవేళ ఎవరికైనా యీ 'పుప్పొడి అలర్జీ' వలన పైన చెప్పిన రోగాలు వస్తే తగ్గించడానికి మందులేవీ లేవా? ఉన్నాయి సిబావారి 'ఎన్టిస్టిన్' మాత్రలు లోనికి తీసుకుంటూ, 'బెటన్నేట్ – ఎన్ ఆయింట్‌మెంట్' పై పూతగా వాడితే త్వరగా తగ్గుముఖం పడతాయని పూనా వైద్య ప్రముఖులు అనుభవ పూర్వకంగా తెలుసుకున్నారు ఏది యేమైనా డాక్టర్లను సంప్రదించడం యెలాగూ తప్పదు

ఇప్పటికే యీ మొక్క ధాటికి ఓర్చుకోలేక మహారాష్ట్ర ప్రజలు పడుతున్న పాట్లకు బొంబాయి అసెంబ్లీలో పలువురు ఎమ్మెల్యేలు పదే పదే ఆందోళన వ్యక్తం చేసారు అందుకే ఆంధ్ర ప్రదేశ్‌తో బాటు అన్ని రాష్ట్రాల ప్రజలూ యీ పిచ్చి మాచి పత్రిని పెరిగీ పెరగకముందే, పూలు పూసే లోగానే ఎక్కడ కనబడితే అక్కడ పీకి పారవేయాలి

— డా॥ కొప్పుల హేమాద్రి

---

కొని కొంతమంది షేంపెయిను తాగారు కొంతమంది స్కాచ్ పూదేశారు సనాతనుడయిన లక్ష్మణరావు మామ్మ యిచ్చిన మాగాయ నంచుకుని, మజ్జిగాన్నం తిన్నాడు ఏమయినా ఆవకాయకీ, ఆంధ్రుడికీ ఏదో అవినాభావ సంబంధం వుంది

ప్రోజెక్టులో పనిచేసిన సిబ్బంది కొంతమంది యింటిముఖం పట్టేరు సింహాచలం కొండ పక్కనుండి మెయిల్ వెళుతూ వుంటే, చలిజ్వరం వచ్చిన వాడిలా వణకటం మొదలుపెట్టేరు లక్ష్మణరావుగారు స్వామికి కోపం వచ్చిందేమో ననుకుంటూ చేతులు ముడిచి నమస్కారం చేస్తూ దండకం చదువుతున్నారు కడుపులో దేవినట్టయింది లేవెటరీకి పరిగెట్టేరు పెద్ద విరేచనం, వాంతి అయిపోయాయి నీరసం ఆవరించింది గొంతుక పిడచ కట్టుకు పోయింది వాల్తేరు స్టేషన్‌లో మెయిల్ ఆగేసరికి ప్రాణాలు ఒదిలిపెట్టి ప్లాట్ ఫారం మీద పడిపోయారు లక్ష్మణరావుగారు జీవితాంతం కలలుగన్న గమ్యస్థానం అందుబాటులోకి వచ్చేసరికి నూనె నిండుకున్న దీపంలా లక్ష్మణరావుగారి జీవితం అంతమయింది విక్రమార్కుడి గద్దెలా తెలుగుగడ్డ గాలి తగిలేసరికి మహామారి ఏదో నిండు వయస్సులో వున్నవాడిని పొట్టనపెట్టుకుంది

లక్ష్మణరావుగారి మరణ వార్త విద్యుత్ ఘాతంలా తగిలింది నయా ఢిల్లీకి మిలటరీవారు నిమిషాలమీద శరీరాన్ని తమ అధీనంలోకి తీసుకొని కెజి హెచ్ లో మిలటరీ వైద్యులచేత శవ పరీక్ష జరిపించేరు రేడియేషన్ డెత్ కాదని నిర్ధారణ అయిన తర్వాతనే లక్ష్మణరావుగారి మరణవార్త దేశానికి తెలిసింది ఎంత బుర్ర బద్దలుకొట్టుకున్నా వైద్యులకి మాతం ఈ చావు ఎలా సంభవించిందో అర్థం కాలేదు ఈ విషయం తెలిసేవరకూ శవాన్ని దహనానికి ఇవ్వదలుచుకోలేదు ప్రభుత్వం పేథాలజీ వారు ప్రేతాన్ని ఏ కీలుకాకీలు విడగొట్టి కంచు కాగడావేసి వెతుకుతున్నారు

రెండు రోజులు తిరిగేసరికి లక్ష్మణరావుగారి సహోద్యోగి ఒహడు మెడ్రాసులో హరీ మన్నాడు చలి, ఒణుకు, ఒకే ఒక వాంతి, ఒకే ఒక విరేచనం శరీరం అతి త్వరగా డీహైడ్రేటు అయిపోయి, లక్షణాలు కన్పించడం మొదలయిన తర్వాత నిమిషాల మీద ప్రాణం పోయిందట

వ్యాధి లక్షణాలలో వరస, వాటి కనిపించేసరికి, ఈ వ్యాధికి కారణభూతమయిన బేక్టీరియా, వైరసులమీద వేట ప్రారంభం అయింది ఈ వ్యాధి తలా తోక అర్థం అయేసరికి లక్షలాది ప్రజలు మరణించేరు

ఈ తాజా వ్యాధికి ఎమ్ ఎల్ ఆర్ సిండ్రోమని పేరు పెట్టేరు ఈ ఎమ్ ఎల్ ఆర్ అన్నవి మందపాటి లక్ష్మణరావుగారి పేరులోని పొడి అక్షరాలు మలేరియా, కలరా లక్షణాలని పోలిన ఈ జబ్బుని మలేరియా + కలరా, మలరా అని కొంత మంది కుదించేరు ఈ మలరా అన్నది కాకతాళీయంగా మందపాటి లక్ష్మణరావు అన్న పేరుని తెలుగులో వ్రాస్తే వచ్చే పొడి అక్షరాలే అని ఎవరో సూచించారు

కార్చిచ్చులా మలరా భారత దేశం నుండి బంగ్లాదేశ్, పాకిస్తాన్ వంటి ఇరుగు పొరుగు దేశాలకి వ్యాపించింది కల్లు తాగిన కోతి నిప్పు తొక్కినప్పుడు గెంతినట్లు గెంతేడు పాకిస్తాన్ ప్రధాని భుట్టో ప్రతి 'ప్రామ్యుడూ' అణుబాంబులు పేలుస్తామంటే ఏమిటవుతుంది ఇటువంటి పనులు చెయ్యవద్దని ఎన్నిసార్లో చెప్పేను'' అని వంత పాడేడు నిక్సన్

ఇలా అంతర్జాతీయ రంగంలో అల్లరి పెరిగేసరికి 'మలరా' ఎలా వచ్చిందో తెలిసికోవాలన్న పట్టుదల దేశంలో పెరిగింది బాంబు పేలిన స్థలంలో, మూడవ నెంబరు బెస్టు టనెల్‌లో కీ శే మలరాగారు రహస్యంగా దాచిన మాగాయ సీసా కనిపించింది చెక్కు చెదరకుండా అలాగే వుంది సీసాలో వున్న ఊరగాయ కూడ ఏ విధంగానూ పాడవలేదు

దేశం పరపతి గంగపాలవుతూ వుంటే చూస్తూ ఎలా వూరుకోవడం? భారీ యెత్తున పరిశోధన జరిగింది మానవ కులంలో పుట్టిన ఈ ముసలాన్ని సమూలంగా నిర్మూలించడానికి భారత ప్రభుత్వం కంకణం కట్టుకొంది

బొంబాయిలో కీ శే లక్ష్మణరావుగారు పని చేసే పరిశోధన శాలలో ఒక టెలివిజన్ మానిటర్ సెట్ వుంది ఈ టెలివిజన్ సెట్ ఫ్లయిబేక్ సర్క్యూట్‌కి షీల్డింగు సరిగ్గా లేక ఆ సర్క్యూట్ నుండి ఎక్స్–కిరణాలు లీకు అవుతున్నాయిట ఈ టెలివిజన్ సెట్ పక్కగా నున్న బీరువాలోని సీసాలో రావుగారి బామ్మగా రిచ్చిన మాగాయ వుందిట చెమ్మతగిలిన మాగాయకి కొంచెం బూజు పట్టిందిట సాధారణంగా ఈ బూజు అంత ప్రమాదమయినది కాదు ఎండలో పెడితే వూరగాయ బాగుపడిపోతుంది కాని ఈ బూజుకి ఒక నియమిత మయిన శక్తి వున్న ఎక్స్ – కిరణాలు తగిలేసరికి కొంప మునిగింది—

ఈ బూజులోని బేక్టీరియా యొక్క డి ఎన్ ఏ బణువులో ఒకచోట 'సిస్టీను' అనే పేరు గల నవామ్లము (ఎమినో ఏసిడ్) వుందిట ఈ సిస్టీను అనేది ఒక జంట పూస లాంటిది టెలివిజన్ సెట్ నుండి కారిన ఎక్స్ కిరణాలు ఈ సిస్టీనులోని ద్విగంధక బంధం (డైసల్ఫయిడు బాండు)కి తగిలినప్పుడు, ఈ బంధం విడిపోయి, చుట్టూ వున్న చెమ్మలోని ఉదజని సహాయంతో రెండు థయోల్ గ్రూపులుగా విడిపోయి సిస్టీను కాస్తా 'సిస్‌టయిన్'గా మారిపోయిందిట అంటే డి ఎన్ ఏ లోని జంటపూస కాస్తా పగిలి రెండు పూసలుగా విడిపోయిందన్నమాట తత్ ఫలితంగా డి ఎన్ ఏ లో ఒక మెలిక విడిపోయిందన్నమాట ఈ ఒక్క మార్పు వచ్చేసరికి డి ఎన్ ఏ తయారుచేసే ఆజములు (ఎన్‌జయిములు) లోనూ, ప్రాణ్యము (ప్రొటీను)లలోనూ పుంఖాను పుంఖాలుగా మార్పులు వచ్చి, అపకారం చెయ్యని బూజులోని బేక్టీరియా కాస్తా మహామారిగా తయారయిందిట 'ఎక్స్' – కిరణాలలోని శక్తి మోతాదుకి ఏమాత్రం తేడాలో వచ్చినా యీ ప్రతివర్తనం (మ్యూటేషన్) యీ విధంగా జరగదుట ఎందుకంటే ''సిస్‌టయిన్'' లోని థయోల్ గ్రూపుకి రేడియేషన్

మోతాదు ఏమాత్రం ఎక్కువ అయినా, నిశ్చలత్వం పోగొట్టుకుంటుందిట అందుకనే మూడవ నెంబరు 'టెస్టు టనెల్'లో మాగాయ పాడుకాలేదుట

ఇలా ప్రతివర్తితలు చెందిన బేక్టీరియా రోగి శరీరంలో అతి త్వరగా పెరిగి ప్రాణం తీస్తుందిట! రోగి శరీరం నుండి వుమ్మి, వాంతి, విరేచనములతో యీ బేక్టీరియా బయటకి వచ్చి, ఎండకి ఎండి, 'స్పోరు'లుగా తయారయి, సునాయాసంగా ఆమడల దూరం ప్రయాణం చేసి, చెమ్మ తగిలినప్పుడల్లా చేవ పుంజుకుని చంపుతున్నాయిట

కనుక మన దేశానికి వచ్చిన ముప్పకి కారణం చెత్తగా తయారు చేయబడ్డ టెలివిషన్ మానిటర్ సెట్! ఈ టెలివిషన్‌ని అమెరికన్ ప్రభుత్వం వారు భారతదేశానికి ఫారిన్ ఎయిడ్ ప్రోగ్రాము'లో బహుమానంగా యిచ్చేరుట —

ఈ కమిటీ రిపోర్టుని భారత ప్రభుత్వం అమెరికా అధ్యక్షుడుకి పంపింది!

# కించిత్ భోగే భవిష్యతి

చిరునవ్వుతో చేతిలోని కపాలంవైపు దీక్షగా చూస్తూ "నిజమే! నాయనా! పొరపాటే! 'బృహత్ భోగే భవిష్యతి' అని వ్రాయవలసింది" అన్నాడు బ్రహ్మ

తండ్రి వాక్కులోని వ్యంగ్యం వ్యక్తమవగానే నారదుడు చిన్నబుచ్చుకొన్నాడు విధాత విధి వ్రాతని యిలా వివరించేడు

"సింహాచలంలో నరసింహస్వామి దేవాలయం నుండి పిఠాపురంలోని పాదగయ వరకు వున్న భూభాగం గయుడనే రాక్షసుని కళేబరంతో కల్మషమయింది ఈ పాప భూమిలో పుట్టి, పెరిగి, జీవితాంతం కీర్తి కాంక్షతో అలమటించిన వ్యక్తిది యీ కపాలము విధి వ్రాతని ఎవరూ దాటలేరు పాప భూమి మీద కాలు మోపిన తర్వాతనే రోగ లక్షణాలు బయటపడి మరణం సిద్ధించింది మరణానంతరం లక్ష్మణరావు పేరు, జీవిత గాధ అంతా ప్రపంచానికి తెలిసింది లక్ష్మణరావు పాడి అక్షరాల పేరు భూలోకంలో చిరకాలం నిలుస్తుంది అందుకనే 'కించిత్ భోగే భవిష్యతి' అని వ్రాసేను

"మరయితే 'బృహత్ భోగే భవిష్యతి' అని వ్రాయవలసింది అని ఎందుకు అన్నారు? వెటకారానికా!" పితృమూర్తిని ప్రశ్నించేడు నారదుడు

విచార వదనంతో వున్న కుమారుడిని వూరడించడానికా అన్నట్లు బ్రహ్మ చిరునవ్వుతో అన్నాడు

"తుచ్ఛమయిన ఈ కపాలం కాలచక్రంతో పంచభూతాలలోను కలిసిపోడానికి బదులు నీవంటి దేవర్షి హస్తాలలో పడి స్వర్గానికి వచ్చిందంటే అది 'కించిత్ భోగం' ఎలాగవుతుంది?"

తన మానస పుత్రుని ముఖంలోని చిరునవ్వుని బ్రహ్మ గమనించకపోలేదు

# పుత్తడి బొమ్మ

(20వ పేజీ తరువాయి)

"ఒరే, ఇది నా కల్లంరా ఆడు నా కంబారోడ్రా ఆడిని కొడతాను సంపుతాను అడగనానికి నువ్వెవుడివిరా?"

"నేనెవుణ్నో ఆనిక్కి సెప్తాను గాని బావ్, మల్లీ మరోసారి ఆడి ఒంటిమీన సింతరువ్వ పడితే-నా సేపాటికర్ర నీ బరతం పడ్తాది! సూస్కో మరి!!"

అంతవరకూ అవాక్కయి కూర్చున్న కరణం లేచి నిలబడ్డాడు గబగబా ధర్మయ్య దగ్గరికి వెళ్లాడు "ఊళ్లో వున్న ఆడపిల్లల మీద చెయ్యి వేసి అల్లరి చేస్తే బుద్ధి చెప్పక వూరుకూంటారుట్రా?" అని అన్నాడు

"ఊల్లో ఆడోల్ల మీద సెయ్యేసేడా? ఆల్ల తాలుకోల్లు ఏరీ? ఏం కరణం బావూ, పల్లకున్నావేం? నీ పెల్లాంమీన సెయ్యేసేడా? నీ కంబారోడివి గాని నేను కానే ఆ బావు బతికిస్తే బతకనానికీ, సంపీస్తే సవ్వనానికీ, ఓరయ్యా, నువ్వు ఒల్లమ్ముకున్నావు మరందుసేత నువ్వు పల్లకో మాం మా గొడవ సూసుకుంటాం మద్దిన నువ్వు రాక!" అని తండ్రికి జవాబు చెప్పి, చివ్వున గవరయ్య బుగత వేపు తల తిప్పి చూసేడు ధర్మయ్య

"ఆఁ ఏటి బావూ, ఆణ్నెందుకలా సావబాత్తున్నావ్?'

"ఒరే ఒరేయ్! మీ అయ్య ముకం సూసి "

"మా అయ్య ముకం సూసి నువ్వేం వూరుకోక బావ్ పుల్లిగాళ్లా నా కాలుసేతులు కట్టేసి నేవు సావబాత్తే అమ్మో అయ్యో అనడానికి నేను పుల్లిగాణ్ణి కాను నీ సేతల రెండు రువ్వలున్నాయి అయి పారీసి కర్రట్టుకో నా సేతల ఈ సేపాటి కర్రుంది సావో రేవో తేల్సుకుందాం రా!" అన్నాడు ధర్మయ్య కర్రని నేలకి కొట్టి

గవరయ్య బుగత బిక్క చచ్చిపోయేడు కరణం నోట్లోని బీడీ పొగ ఉక్కిరిబిక్కిరైంది చుట్టూ చేరిన జనం గుండెలు పొంగేయి కండలు అదిరేయి పల్లంది పట్టుకునున్న చుక్కమ్మ 'మా అన్న గుండి దైర్నం వున్నోడు!' అనుకుంది సంతృప్తిగా రాములు మాత్రం ఆవేశంతో చిరచిర లాడిపోయేడు "ఓరే — ధర్మిగా! పొయ్యాకాలపెదవా నోటి కెంత మాటొస్తే అంతేన్రా? పెద్దోల్తో అలగేన్రా కలబడ్తావూ?" అంటూ కొడుకు మీదికి వెళ్లబోయేడు

"ఓరయ్యా, నా నిందాకే సెప్పినాను నువ్వింద రాక అయ్యకాదు, ఆడమ్మా మొగుడు ఎవుడొచ్చినా పుచ్చెలు లెగ్గొట్తాను నా కడ్డం రాకుమీ!" అంటూ దగ్గరికి వచ్చిన రాముల్ని ఓ తోపు తోసేడు ధర్మయ్య

ఆ తోపుకి నేలమీద పడబోయి నిలదొక్కుకున్నాడు రాములు

"ఇప్పుడు సెప్పు బావ్, ఆడినెందుకలా సంపుతున్నావ్? ఆ రగతం సూసేవా?" అన్నాడు ధర్మయ్య బుగత కళ్లల్లోకి తీక్షణంగా చూస్తూ అప్పసెల్లెలి సెయ్యట్టుకున్నాడా? సెప్పు బావ్!"

కరణం గొంతుకలో పచ్చి వెలక్కాయ పడింది పళ్లు పటపట కొరికేడు

"ఈ గవరయ్య బుగత మాత్తరం తక్కువోడేటి? ఆయనగోరు చేసిన పన్లకి సిచ్చగా ఈ సేపాటి కర్రెత్తి నన్ను బాదమన్నావేటి? కరనం బావూ? ఆ పని పెద్దోల్లు సేస్తే తప్పు లేదంటావేటి?" అని మరో ప్రశ్న వేసేడు

"ఓరెదవా! నా కాడికి ఇష్టమయ్యే ఒచ్చేర్రా ఆల్లూ నేనెవర్నీ బలివిని సెరబట్టలేదు!" అన్నాడు గవరయ్య బుగత క్రూరంగా నవ్వుతూ ఆ నవ్వులోనే తన రసికతనంతా ఒలకబోస్తూ

'ఈ పుల్లిగాడు కూడా నీ యింట్లో వున్న నీ ముండమోసిన ఆడకూతుర్ని సెరబట్టనేదు ఆ యమ్మకి ఇష్టంవయి పిలిత్తేనే ఎల్లేడు "

"ఒరేయ్!" అని గర్జించాడు గవరయ్య

"ఒట్టి గొడ్డుకి అరుపు లెక్కువని ఎందుకలా అరుత్తావు బావ్ ఇంకా యివరంగా సెప్తినూ నీకు తెలకపోతే నన్నడుగు నా వొక్కడికే కాదు వూల్లో అందరికీ ఈ రగస్యం ఎరికే నీ కూతురు మోజుపడి పిలిత్తేనే యీ పుల్లిగాడెల్లేడు అంతేగాని నువ్వన్నట్టు బలింవీని సెయ్యట్టుకోలేదు పార్తీపురం ఎల్లి డాక్టరు బావుకి సూపించు నీ కూతుర్ని సూసీసూడగానే మూడో నెల అన్సెప్పేస్తాడు ఏ డాట్రయినా " అనేసి చకచకా ముందుకి నడిచి పుల్లిగాడి కట్లు విప్పసాగేడు ధర్మయ్య




పిచ్చి ఆవేశంతో శివం ఎత్తినవాడిలా వూగిపోయేడు బుగత అవమానంతో పాటు అప్పుడే తెలుసుకున్న 'నిజం' అతన్ని నిశ్చేష్టుడిని చేసింది ఎదురుగా వున్న ధర్మయ్యని ముక్కలు ముక్కలుగా నరకాలన్న క్రోధం మనసులో హోరుమంది అంతలో — రాబోయే ఎలక్షన్లూ, రాబోయే ఓట్లూ, కూలీల సంఘానికి ధర్మయ్య ముఖ్యుడన్న సంగతీ అతనికి గుర్తు వచ్చేయి

ధర్మయ్యనీ, వాడు మోసుకు వెళ్తున్న పుల్లిగాడినీ చూస్తూ స్థాణువులా నిలబడిపోయేడు గవరయ్య బుగత

[ఇంకా వుంది]



పద్మనాభం సమర్పించు రేఖా & మురళీ ప్రొడక్షన్స్

# మాంగల్యభాగ్యం

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
**బి.పద్మనాభం**

నిర్మాత
**బి.మురళి**

సంగీతం:
ముత్తు
ఫొటోగ్రఫీ
ARK మూర్తి
మాటలు
కొడకండ్ల అప్పలాచార్య
కళ:
అనంతరామ్



సీరియల్

# అతకని అనుబంధాలు

పి. యస్. శాస్త్రి

(గత సంచిక తరువాయి)

ఆయన మాటలకు హైమలో కొంత చైతన్యం వచ్చిందట. తన గత జీవితాన్ని లైనంతవరకూ మర్చిపోతూ రోగులకు సేవ చేసే నర్సు ట్రైనింగ్ పొందిందట... న్నేళ్ల సాన్నిహిత్యం తరువాత వాళ్లలో ఆప్యాయత అంకురించిందట. ఒకేరకమయిన దుఃఖంతో బాధపడినవాళ్లు దగ్గరకావటంలో ఆశ్చర్యం లేదుకదా!

తాము వివాహం చేసుకోవటం తమ మొదటి ప్రేమ భావానికి ద్రోహం చేసినట్లవుతుందేమోనని ముందు భయపడ్డారట వాళ్లు. కాని ఆ నాటి ప్రేమ తీవ్రత లేదిప్పుడు వాళ్లల్లో! కొన్ని యేళ్లు కలిసి మెలిసి తిరిగి వొకరి నొకరు అర్థం చేసుకున్న లౌకిక ప్రేమ యిది. ఒకరిమీద వొకరికున్న ఆప్యాయతను, స్నేహభావాన్ని వివాహబంధంతో పవిత్రం చేసుకున్నారు వాళ్లు! వాళ్ల కుమార్తే సుధ!"

ప్రసాద్ సిగరెట్‌ను నీటిలోకి విసిరాడు. 'చుయ్' మన్న చప్పుడుతో అది ఆరిపోయింది.

"ఇప్పుడుచెప్పు కుమార్! పాత విశ్వాసాలను కాదని మళ్లీ వివాహం చేసుకున్న హైమవతిగారి కుమార్తెను నువ్వు పెళ్లి చేసుకోగలవా? కందుకూరి వీరేశలింగంగారు మరణించి యాభై యేళ్లయినా, ఆయన శత జయంతి వుత్సవాలు జరుపుకుంటున్నా, విధవా వివాహాలు మనకు మామూలు కాలేదు ఇంకా! పురుషుడు రెండుసార్లు, మూడు సార్లు, పెళ్లి చేసుకున్నా చాలా మామూలు విషయంగా వూరుకొనే మనం స్త్రీ పునర్వివాహం చేసుకుందంటే ఇంకా వింత విషయంగానే పరిగణిస్తున్నాము" ప్రసాద్ ఆవేశంగా అన్నాడు.

"సుధని గాఢంగా ప్రేమిస్తున్నానని ముందే చెప్పాను! ఆమెను తప్పకుండా వివాహం చేసుకుంటాను! ఈ కథ విన్నాక చేసుకోకుండా వుండలేను!" కుమార్ నిశ్చయత ధ్వనించే కంఠంతో అన్నాడు.

అందరూ హైమవతి భూషణరావుగార్ల కథ గురించే ఆలోచిస్తున్నారు ఎంత వింతగా వుంది ఇదంతా!

లాంచికి రిపేరు రాకుండావుంటే తామెవ్వరికీ యీ కథ పూర్తిగా తెలిసేదికాదు! వారి జీవితంలోని కొన్ని భాగాలు తెలిసిన వాళ్లు యిక్కడ వొకేసారి దొరకటం యెంత యాదృచ్ఛికం!

"అయితే ఆ పొలాలలో వదిలేసిన కుర్రాడి ఆచూకీ దొరకలేదా? దానిని గురించి హైమవతిగారు మళ్లీ ఎప్పుడూ ప్రయత్నం చేయలేదా?" శ్యామసుందరం తాపీగా ప్రశ్నించాడు.

"మా అమ్మమ్మ ఆ కుర్రాడి గురించి అడిగితే ఆవిడ భోరుమని ఏడ్చిందట. వాడిని తలుచుకున్నప్పుడు నాకు విపరీతమైన బాధ కలుగుతుంది. ఆయన కూడా వాడి గొడవెత్తరు! ఇరవై యేళ్ల తరువాత మీరొక్కరే వాడిని గురించి అడిగారు! బిడ్డ చనిపోయాడని తెలిస్తే అదొక రకమైన బాధ. కాని బ్రతికి వున్నాడో చనిపోయాడో తెలియక


ప్రొద్దున్న ఉండే
తాజాతనపు
అనుభవము
రోజంతా
ఉంటుంది
(నీళ్ల స్నానమిచ్చే తాజాదనము గంటల
కొలదీ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్. ఆ
అనుభవమును రోజంతా ఉంచుతుంది. దానిని
మీ ఒళ్లంతా జల్లుకోండి. మీరు తాజాగా,
శుభ్రముగా మరియు చల్లగా ఉంటారు. దాని
తేలికైన సువాసన మిమ్మల్ని పట్టి ఉంటే,
అది చెమటను పిల్చి మిమ్మల్ని పొడిగా,
సౌఖ్యముగా ఉంచుతుంది, ముఖ్యంగా మండు
ఎండా కాలములో. చెమట వాసన, చర్మము
జిగపట్టుట ఉండవు. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్
టాల్క్ ఎంత మెత్తగా ఉంటుందంటే దానిని
మీ ముఖము మీద కూడ రాసుకోవచ్చును.)
పాండ్స్
డ్రీమ్‌ఫ్లవర్
టాల్క్
Pond's
Dreamflower talc
Dreamflower talc

# అతకని అనుబంధాలు

*జరిగిన కథ:* నవలా చిత్రీకరణ కొరకు స్నేహితుడు లక్ష్మీపతితో నాగార్జునసాగర్‌కు వచ్చిన శ్యామసుందరానికి తోటివిహారయాత్రీకులు సౌమిత్రి, మాయ, కల్పన, కాంచనలతో పరిచయమౌతుంది. శ్యామసుందరం అక్కడి శిథిలాలనూ, వాటి పూర్వ చరిత్రనూ మిగిలినవారికి వివరించి చెబ్తూంటాడు. ఒకేరకపు స్వభావాలున్న మాయ, లక్ష్మీపతి; శ్యామసుందరం, సుమిత్రలు పరస్పరం ఆకర్షితులౌతారు. లాంచీకి రిపేరు రావడంతో నాగార్జున కొండపై చిక్కడిపోతారు యాత్రీకులంతా. శ్యామసుందరానికి తల్లితండ్రులున్నారో లేదో తెలీదని, అనాథాశ్రమంలో పెరిగాడని తెలుసుకుంటాడు లక్ష్మీపతి. ఆ రాత్రికి కూడా అక్కడే ఉండాలని తెలుసుకుని భయపడుతున్న అమ్మాయిలకు ధైర్యం చెబుతాడు శ్యామసుందరం. లక్ష్మీపతి ఇష్టపడితే అతన్ని పెళ్ళి చేసుకుంటాను అని మాయ అనటంతో అనాథాశ్రమంలో పెరిగిన శ్యామసుందరంతో తన పెళ్ళికి తల్లితండ్రులు ఒప్పుకుంటారో లేదో అని సంశయిస్తుంది సుమిత్ర. కుమార్ తను భూషణరావుగారి కుమార్తె సుధని ప్రేమిస్తున్నట్టు, ఆమెని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నా హైమవతిగారెవరో తెలిస్తే బాగుణ్ణు అనటంతో ప్రసాద్ హైమవతిగారి గతచరిత్ర చెప్పడం ప్రారంభిస్తాడు.

పోవడం ఇంకా బాధ! వాడిని గురించి నా మనస్సు ఎప్పుడూ లోపల్లోపల ఆలోచిస్తూనే వుంటుంది!'' అని జవాబిచ్చిందట ఆవిడ. వాళ్ళ అమ్మగారు పక్షవాతం వచ్చి నోటమాట రాకపోవటంతో చివరి రోజులలో సంజ్ఞలతో తనే కుర్రాణ్ణి పొలాల్లో వదిలేసి వచ్చానని చెప్పిందట! ఎక్కడో వొకచోట తన కొడుకు బ్రతికి వున్నాడనే ఆవిడ విశ్వాసంలా వుంది!'' ప్రసాద్ జవాబిచ్చాడు.

ఆ తప్పిపోయిన కుర్రవాడి గురించి అందరి మనసులూ ఆలోచిస్తున్నాయి. ప్రతివారి జీవితంలోనూ యేదోవొక అపశృతి వుంటూనే వుంటుంది. అది వాళ్ళను బాగా ఎరిగిన వాళ్ళకు మాత్రమే తెలుస్తుంది. అతి సంతోషంగా, ముచ్చటైన సంసారంలా కనుపించే భూషణరావుగారి కుటుంబంలో యింత విషాదం దాగివుందని ఎవరికి తెలుస్తుంది.

"అబ్బా! అప్పుడే వొంటిగంటన్నరైంది! ఇంక పోదాం!'' రేడియం డయల్ వాచీ చూసిన మోహన్ లేచాడు. అతనితో మిగిలిన వాళ్ళూ లేచారు.

మెల్లగా రెస్టుహౌసుకు దారి తీశారు. ఎవరి ఆలోచనలో వాళ్ళున్నారు. 'రేపు హైద్రాబాదు చేరితే మాయవాళ్ళ తల్లి దండ్రుల్ని కలుసుకోవాలి. వాళ్ళు ఇష్టపడితే 'మాయ'ను వివాహం చేసుకోవాలి!' అనుకున్నాడు లక్ష్మీపతి. 'అలాగే శ్యామసుందరం వివాహం గురించి కూడా నాకలు వెయ్యాలి. సుమిత్ర అతనంటే ఆసక్తి చూపుతోంది. సుమిత్ర తల్లిదండ్రులు అంగీకరిస్తే, శ్యామసుందరం పెళ్ళికి తనే పెళ్ళిపెద్ద అయ్యి అతని వివాహం ఘనంగా జరిపించాలి. అతని మనసు తెలిసి మసిలే భార్య లభిస్తే, శ్యామసుందరం మనస్సులోని వొంటరితనం పోతుంది. "నిన్ను నిన్నుగా ప్రేమించుటకు, నీ కోసము కన్నీరు నించుటకు'' అన్న శ్రేయం లోలా 'తనకోసం వొక వ్యక్తి ఉన్నారు' అనే భావన మనిషికి అమృతం లాంటిది? అది కలిగించినంత బలం ప్రపంచంలోని మరేశక్తి కలిగించజాలదు!

లక్ష్మీపతి భవిష్యత్తు గురించిన వూహల్లో తేలుతున్నాడు. హైమవతిగారి కళ్ళల్లోని విషాదానికి కారణం అర్థమైంది అనుకున్నాడు శ్యామసుందరం. కుమార్, మోహన్, మురళీ, ప్రసాద్‌లు "యీరోయి గడచునా యిక తెల్లవారునా'' అన్నట్టు ఆలోచిస్తున్నారు!

రెస్టుహవుస్ వరండాలోకూడా టార్పాలిన్‌లు పరిచి వున్నాయి. మురళీ బృందం అంతా వొకవైపు ఖాళీ చూసుకుని నడుం వాల్చారు.

మురళీవాళ్ళు పడుకున్న స్థలానికి మరి కొంచెం దూరంలో లక్ష్మీపతి నేల మీద కూర్చున్నాడు. లక్ష్మీపతితో వచ్చిన శ్యామసుందరం ఏదో ఆలోచిస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాడు.

రెస్టుహావుస్‌లో యాత్రికులంతా నిద్రలో మునిగి వున్నారు. మరి కాస్సేపటికే మురళీ బృందంకూడా పడుకున్నారు. అయినా శ్యామ




సుందరం పడుకోవడానికి రాలేదు ఒట్టినేల మీద పడుకుంటే నిద్రరాని లక్ష్మీపతి శ్యామసుందరాన్నే పరీక్షగా చూస్తున్నాడు శ్యామసుందరంలో యిప్పుడు కనిపించినంత సంచలనం యింకెప్పుడూ చూసి వుండలేదతను! ఏందుకా అని ఆలోచిస్తున్న అతనికి హటాత్తుగా మెరుపులా వొక ఆలోచన వచ్చింది! "కొంపతీసి..." లక్ష్మీపతి ఆలోచన పూర్తయ్యే లోపలే శ్యామసుందరం అతని దగ్గరకు వచ్చాడు.

"పతీ! భూషణరావుగారి చరిత్ర వో మంచి కథకు ప్లాట్‌లా పనికొస్తుంది కదూ!" అన్నాడు.

'అయితే ఇదా శ్యామసుందరం యింత సేపటినుండి ఆలోచిస్తున్నది! ఈ కథకులకు ఎక్కడకు వెళ్లినా, ఏం వింటున్నా కథలురాసే బుద్ధి వదలదు!' నిస్పృహగా నిట్టూర్చాడు లక్ష్మీపతి.

"అవును చాలా మంచి కథగా వస్తుంది" అన్నాడు లక్ష్మీపతి బరువుగా! "కాని జీవితం కథ కంటె గమ్మత్తుగా వుండటం యిప్పుడే తెలుసుకొన్నాను!" మళ్లీ అన్నాడు.

"కథలు జీవితాల్లో నుండే పుడతాయిగా! కనుక జీవితాలు కథల్లా వుండటం అరుదేమీ కాదు! కాకపోతే కొందరి జీవితాలు మాత్రం కథల్లో కంటే కూడా విచిత్రంగా నడుస్తాయి. నిజానికి జీవితాన్ని పూర్తిగా కథలో చిత్రించడం ఎవరితరమూ కాదు!" శ్యామసుందరం ఆగాడు

జేబులోనుండి యేదో వొక వస్తువునుతీసి గుప్పిట్లో పెట్టుకుని లక్ష్మీపతికి చూపించాడు.

## అతకని అనుబంధాలు

అదిచూసిన లక్ష్మీపతి కెవ్వున అరవబోయాడు! శ్యామసుందరం తన చేతితో అతని నోరు మూసాడు. అతని చేతిలోది వో రాగి తాయెత్తు!

దాని మూత తీసి శ్యామసుందరం దాంట్లోంచి వో పాత కాగితాన్ని బయటకు తీశాడు దానిలో "హైమా! నిన్ను నేను గాఢంగా ప్రేమిస్తున్నా! ఇట్లు నీ .." అని వుంది. ఆ తరువాత చినిగిపోయి వుంది.

"అయితే నువ్వేనన్నమాట హైమవతిగారి తప్పిపోయిన కుర్రవాడివి!" లక్ష్మీపతి ఆనందంగా అన్నాడు "ఇప్పుడే వాళ్లందర్నీ లేపి ఈ సంగతి చెబుతా" అంటూ వాళ్లను లేపబోయాడు

శ్యామసుందరం నవ్వుతూ అతన్ని ఆపుజేసాడు

"ఎంత వెర్రివాడవురా పతీ! ఎంత తేలిగ్గా నమ్మేశావు! ఇప్పుడే నువ్వో బరువైన కథని విన్నావు. ఆ కథ ప్రభావం నుంచి నువ్వింకా తేరుకోలేదు! నేను వో అనాథాశ్రమంలో పెరిగాను. నా దగ్గరా వో రాగి తాయెత్తు వుంది. కనుక యిందాక నువ్వు విన్న మాటలున్న కాగితం చూపించగానే నేనే యిందాకటి కథలోని తప్పిపోయిన కుర్రాణ్ణి అనుకున్నావు! ఇక్కడికి రాగానే వో పాత కాగితం ముక్కమీద ప్రసాద్ చెప్పిన మాటలు రాసి నేనే ఆ తాయెత్తులో పెట్టాను!

చూసావా! ఎక్సైట్ అయివున్నప్పుడు మనుష్ల్ని నమ్మించటం ఎంత తేలికో!"

_ శ్యామసుందరంఇంకా నవ్వుతూ నేవున్నాడు.

"ఊహూ! నాకు నమ్మకం కలగటం లేదు! నా మనస్సు గట్టిగా చెబుతోంది, నువ్వే ఆ కుర్రవాడివని! హైమవతిగారికి భూషణరావుగారికి ఆ సంగతి యిప్పుడే చెప్పివస్తా" అంటూ లేవబోయాడు లక్ష్మీపతి.

"పతీ! నీకు మతి పోయిందా? నేను సరదాకి వో ట్రిక్‌చేస్తే నువ్వు పెద్దగొడవ చేసేలా వున్నావే!" శ్యామసుందరం తన చేతిలోని కాగితాన్ని ముక్కలుగా చేసి, దాన్ని ఆ తాయెత్తును చీకట్లోకి దూరంగా విసిరేశాడు.

"అయితే నువ్వు వాళ్ల అబ్బాయివి కాదా? అయితే ఎంత బావుండును!" నీరసంగా నిట్టూర్చాడు లక్ష్మీపతి

"మనం చాలా అనుకుంటాంగాని, అనుకున్నవి అనుకున్నట్టుగా జీవితంలో చాలా వరకూ జరగవు! కథ, రచయిత చెప్పు చేతల్లో వుంటుంది కనుక రచయితకు తోచినట్టుగా సుఖాంతంగానో, దుఃఖాంతంగానో లేక యిలా జరిగితే బావుంటుంది అని పాఠకుడు అనుకున్నట్లుగానో ముగుస్తుంది

మనం విన్న కథకు ముగింపు యిలావుంటే బావుంటుంది అన్న దృష్టితో, నీ భావాలు ఎలా వుంటాయో తెలుసుకోవటానికి అలా చేసా!" శ్యామ సుందరం ఇంకా నవ్వుతూనే వున్నాడు

ఆనవ్వు ఉప్పెనలా అర్థంలేకుండావస్తోంది. శ్యామసుందరం యింతగా నవ్వటం లక్ష్మీపతి ఎప్పుడూ చూడలేదు!

పగలంతాకష్టపడి పని చేయటంతో, క్రొత్త ప్రదేశమైనా కావలసిన కనీస సౌకర్యాలు లేకపోయినా, పడుకున్న కాస్సేపటికి లక్ష్మీపతికి నిద్రపట్టేసింది. ఆ తరువాత ఏం జరిగిందో అతనికి తెలీదు.

"లేవండి! లేవండి! లాంచీ బాగుపడింది బయలుదేరుతోంది రండి రండి!" అంటూ ఎవరో కేకలు పెడుతూంటే వుదయాన్నే లక్ష్మీపతి బరువుగా కళ్లు విప్పాడు. తన పక్కన యింకా శ్యామసుందరం పడుకునే వున్నాడు అతన్ని తట్టిలేపాడు లక్ష్మీపతి. బద్ధకంగా వొళ్లు విరుచుకు లేచిన శ్యామసుందరం కళ్లు ఎర్రగా జ్యోతుల్లావున్నాయి

అందరూ హడావుడిగా లాంచీ రేవు వైపు బయలుదేరారు

స్నానాలు చెయ్యకపోవటంతో ఉదయం ఎండకు వొళ్లు చిటచిట లాడుతోంది హిల్

# 8 యౌవ్వన వధువలు ఫెమినిక్ గురించి చెపుతున్నారు విశ్వవిఖ్యాతి గాంచిన వక్షస్థలమును వికసింపజేయునది...మరియు దీని ద్వారా మీ వివాహిత జీవితం సుఖవంతంగా వుండేటట్లు సహకరిస్తుంది.

*భారతదేశంలో 20,000కు పైగా యువతులు ఫెమినిక్ పద్ధతి ఉపయోగించుచున్నారు.*



ఇన్నో సెంటా డి'సౌ: "నేను వివాహం చేసుకొని వచ్చినప్పుడు నన్ను చూచి ప్రతి ఒక్కరు ఇలా అన్నారు—ఆహా! వధువు ఎంత అందంగా వుంది. కొన్ని నెలల క్రితం, నా బాల్యపు రూపు చూచి నేనంత వికారంగాను, నిర్జీవంగాను వుండేదానవో వారికి తెలును. కాని ఇప్పుడు నా తేడాన్ని చూచి ఎంత ఆశ్చర్యంగా వుందో చెప్పలేను—
ఫెమినిక్‌కు నా కృతజ్ఞతలు."



శోభా గరేవాల్: "మీ ఫెమినిక్‌నకు కృతజ్ఞతలు. నా వివాహజీవితంలో ఒక సంతోష ఘట్టాన్ని రూపొందించింది. నా వక్షస్థలం 10 సెం.మీ.కు పైగా పెరిగింది. నా శ్రీవారు చూచి ఎంతో ఆశ్చర్యపడ్డారు. నాకు రెండవసారి తొలి రాత్రిలా అనిపించింది. మరియు ఇప్పుడు శ్రీవారితో నేను లైంగిక సంబంధంలో ఎక్కువ ఆనందం పొందుచున్నాను. వివాహితులైన స్త్రీలందరు ఫెమినిక్ ఉపయోగించుట మంచిదని నేను కోరుచున్నాను—ఎంత ఆశ్చర్యకరమైనదో నాకు తెలుసు."



దినైజా కాంట్రాక్టర్: "మమ్మీ మరల ఆనందంగా వుండడాన్కి కారణం? అని నా చిన్న పిల్లలిద్దరు ఎంతో ఆశ్చర్యపడ్డారు." నేను ఫెమినిక్ వుపయోగించక ముందు నేను ఎంతో దిగజారిపోయి వట్టుండేదానను. ఇప్పుడు నాకు నేనే 'ఇప్పుడే వివాహం చేసుకొన్నానా' అనే రూపు గల్గింది. నేనెంతో యౌవ్వనంతోను, నమ్మకంగా వున్నట్లనిపిస్తుంది."



అనుశ్రీ ఘోష్: "నాకు వివాహమై 2 సంవత్సరాలయి, 1 బిడ్డ కలిగిన తర్వాత నా రూపు పూర్తిగా హీనదశలో వున్నట్లు కనబడింది. నేను ఫెమినిక్ గురించి విన్నప్పుడు నాలో మార్పు తీసుకొని రాగలదనే నమ్మకం నాకు లేనేలేదు, నిరాశ కల్గింది కూడ. కాని నాది చూచినప్పుడు దాని ఫలితం, నిజంగా నమ్మలేకపోయాననుకొంది. నేను ఎలా ధన్యవాదాలు చెప్పాలో కూడ తెలియుటం లేదు.



ప్రమీల శర్మ: "నా వక్షస్థలము బాలుర కుండేలా వుండుటచే నాకు ఇలాంటి శాపం ఎందుకు పొందానా అని ప్రతి రాత్రి కూడ నేను ఒంటరిగా నున్నప్పుడు బాధపడుతూ వుండేదానిని. వివాహ సమయంలో పొందే ఆనందాన్ని పొందలేకపోయాను. అప్పుడు ఫెమినిక్ గురించి చదివాను. కాని ఆరు వారాలలో నా కల నిజమౌవుట చూచాను. నేను స్త్రీకి వుండే సౌందర్యాన్ని పొందగల్గాను. ఇప్పుడు మమ్మలను చూచే వారందరు ఈడూజోడైన జంట అంటున్నారు."



మనిషా తల్వాడే: "మీరు దేని గురించి మాట్లాడాలన్నా అక్కడ ఫెమినిక్ వుంది. నా 6 వారాల క్రమమైన వ్యాయామం ద్వారా, నేను నా వక్షస్థలమును పెంపొందింపజేసి, చక్కని రూపు పొందగల్గాను. మా వివాహ జీవితం సఫలీకృతం అగుటవల్ల నేను, మా శ్రీవారు కూడ ధన్యవాదాలు అర్పిస్తున్నాము."



జయశ్రీ నాయర్: "ఒకనాటి రాత్రి మా శ్రీవారు హాస్యంగా మాట్లాడుటలో నేను ఎంతో చిన్నబుచ్చుకున్నాను. కాబట్టి నేను ఏదో ఒకటి చేసి చూడాలనిపించింది. 8 వారాలు క్రమంగా ఫెమినిక్ విధానాన్ని అమలుపరచి చూదాను. నాలో వచ్చిన మార్పు అత్యద్భుతం. వివాహితులైన స్త్రీలకు లాభదాయకమైనది ఈ ఫెమినిక్—నాఫలే."



మీనా ఖేర్కర్: "నా వక్షస్థల రూపు చాల చక్కగా వుండేది, కాని నేను ఒక పాపను కన్న తర్వాత, ఆ రూపుపోయి, చాల దిగజారిపోయాను. దీని గురించి నేను చాల ఆవేదన పడ్డాను. నమ్మకాన్ని కూడ కోల్పోయాను. అప్పుడు ఫెమినిక్ కోర్సు ప్రారంభించిన తరువాత, నా వక్షస్థల రూపు ప్రథమ స్థితికి రావటం జరిగింది—ఫలితం చూచి నాకెంతో ఆనందం గల్గించింది."

ఈ ఫెమినిక్ పద్ధతి మీ వక్షస్థలాన్ని 8 సెం.మీ. లేక అంతకు మించి ఎక్కువ వృద్ధిచేస్తుంది. ఇది మాత్రం గ్యారంటీ. కారణం ఇది అంత పని చేయగల్గుతుంది మీరు ఆ భేదాన్ని చూడ గల్గుతారు కూడ.

## ఫెమినిక్ పద్ధతి అనగానేమి?

ఫెమినిక్ మీ వక్షస్థలాన్ని పెంచుటకు గల ఒక అత్యద్భుత ఫ్రెంచ్ విధానము ఇది క్రీమ్ మాత్రంకాదు మరియు కృత్రిమమైన ఉత్తేజము కాదు ఫెమినిక్ ఒక వ్యాయామము చేయు సాధనము ఐసోమెట్రిక్ విధానముల ద్వారా మీ యొక్క వక్షస్థలం సురక్షితంగా నుంచుటయే కాకుండ వక్షస్థలాన్ని పెంపొందింపచేసి, శక్తివంతంగా వుంచుతుంది.

**MONEY BACK GUARANTEE**

If not delighted with the results in 2 weeks, simply return the course for a full refund (less postage and packing)

MADAME ROUHON 612 CHURCHGATE CHAMBERS NEW MARINE LINES BOMBAY-400 020.

Please rush me the Feminique Isometric Figure Developer for Rs ___ (inclusive of all taxes) under the 2 week guarantee period.

AND/OR ☑ Tick one ☐ Cheque ☐ VPP (Since I am ordering by VPP I guarantee to pay the postman Rs ___ plus Rs 4/ VPP charges) Sign ___ ☐ M O

BEAUTIFUL' 3 ISSUES FREE

Please send me 1 year of Beautiful magazine for Rs 22/ ☐ OR 2 years for Rs 40/ ☐ I will get 3 issues FREE ☐ Cheque ☐ MO ☐ VPP

NAME ___ Signature ___

ADDRESS ___

CITY ___ STATE ___ AGE ___

Cheques Money Orders should be made in favour of ROSS MURARKA INC
Feminique is a divsn of Ross Murarka

AS/

RM 746

# వారఫలం

మహేష్

13-9-1974 శుక్రవారం మొదలు
19-9-1974 గురువారం వరకు

**మేషం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు అనవసరమైన సందేహాలు కలుగుతాయి సాటివారితో మాటపట్టింపు తగవు వారం ఆఖరులో మీ ప్రయత్నాలు సునాయాసంగా నెరవేరతాయి స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

**వృషభం —** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది ప్రయాణాలు వాయిదా పడతాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి

**మిధునం :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది, మున్ముందు మీకు లభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు స్త్రీలకు—సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం —** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు రావలసిన డబ్బు అందుతుంది రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో మీ మంచి తనమే మీకు ఇబ్బందిని కలిగించగలదు స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**సింహం :—** అన్ని వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు వ్యాపారంలో సాటి వారి పోటీ తగ్గుతుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కన్య :—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వ్యతిరేకమైన వార్తలను వింటారు వారం మధ్యలో వృత్తిలో ఆదాయం బాగుంటుంది సాటివారిలో గౌరవం లభిస్తుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభించగలవు స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల.—** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం —** మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది రావలసిన డబ్బు అందగలదు. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**ధనుస్సు —** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభించగలదు సాహసిక వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మకరం .—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది అనవసరమైన వ్యయం చేస్తారు. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కుంభం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి సాటివారిలో గౌరవం బాగుంటుంది వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది

**మీనం —:** వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం ఆఖరులో అనవసరమైన శ్రమ కలుగుతుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. ●

---

## అతకని అనుబంధాలు

కాలనీ చేరితే సుఖంగా స్నానం చెయ్యవచ్చు కదా అన్న ఆలోచనతో ఎవరూ ఆ ఎండను, చెమటను, చిరాకును లెక్క చేయటంలేదు జైలులాంటి యీ ద్వీపంనుంచి తాముబయటపడుతున్నారు అది చాలు వాళ్ళకి ! ద్వీపాంతర వాస శిక్ష అంటే యిలాంటిదేనేమో !

అమ్మాయిలు నలిగిన చీరలతో, వాడిపోయినమొహాలతో, సిగ్గు పడుతూ లాంచీదగ్గరకు వచ్చారు ఈ లాంచీ సవ్యంగా అవతలి వొడ్డుకు చేరితేచాలు అన్న కోరిక అందరి మనసుల్లోనూ మెదులుతోంది !

నిన్న సాయంకాలం వరకూ వున్న, కలిసిమెలిసి మెదిలే మనస్తత్వం మాయమైపోయింది అప్పుడే ! ఎవరి సుఖంగురించివాళ్ళు ఆలోచిస్తున్నారు సీట్లు సంపాదించడందగ్గర నుండి అన్నింటికీ గొడవే !

ఆఖరికి చప్పుడు చేస్తూ లాంచీనాగార్జున కొండనుంచి బయలుదేరింది.

నీటిని చీల్చుకుంటూ ముందుకు సాగిపోతోంది లాంచీ నిన్న ఉదయం లాంచీ బయలుదేరినప్పటి ఉత్సాహం ఎవరిలోనూ లేదు ! క్షణ క్షణం లాంచీ ఎక్కడ ఆగిపోతుందోనని భయం భయంగా ఉన్నారు టూరిస్టులు దక్షిణ విజయపురి వైపు మన్న అనుపు వైపు లాంచీ మలుపు తిరిగే వరకూ ఎవరికీ ధైర్యం లేదు !

"మంత్ర ద్వీపం నుంచి నిష్క్రమిస్తున్నాం" అన్నాడు మురళీ వెనక్కు పోయే కొండల్ని, చుట్టూవున్న నీటిని పైన తేలుతున్న తెల్లటి మబ్బుల్ని చూస్తూ ! అతని లోని చిత్రకారుడు ఉదయ సూర్యుని కాంతిలో వెలిగే ఆ ప్రకృతి అందానికి మురిసిపోతున్నాడు !

"అబ్బ ! పెద్ద పీడకల నుంచి బయట పడినట్టుంది!" అంది కాంచన సంతోషంగా. సుమిత్ర, మాయలకు ఆ ద్వీపం అతి సుందరంగా కనిపిస్తోంది. ఆ ద్వీపంలో ఆగబట్టే శ్యామసుందరం, లక్ష్మీపతులతో సన్నిహిత పరిచయం యేర్పడింది వాళ్ళకి. హైదరాబాదు చేరాక తమ తమ తల్లి దండ్రుల్ని సంప్రతించి వివాహ విషయాలు పరిష్కరించుకోవాలి అనుకుంటున్నారు వాళ్ళు.

కుమార్ సుధ వైపు ప్రక్క చూపులు చూస్తున్నాడు. లక్ష్మీపతి మాయను, మిగిలిన వారిని తప్పించుకుంటూ, దొంగ చూపులు చూడటం గమనించిన శ్యామసుందరం మిత్రుడి భుజం తట్టాడు ప్రోత్సాహకరంగా !

శ్యామసుందరం లోని రచయిత వివిధ యాత్రికులలో కలుగుతున్న వివిధ భావాల్ని గ్రహించడానికి ప్రయత్నిస్తున్నాడు. కొందరు ఆ ద్వీపం మీద వుండిపోయినందుకు బాధ పడుతూంటే కొందరు నిన్న ఆ ద్వీపం మీద వుండ గలిగినందుకు సంతోషిస్తున్నారు. వాళ్ళవాళ్ళ మనస్సుల్లో కలిగిన భావాలను బట్టే అక్కడ ఆగటం 'చెడా మంచా'అన్నది

# షేవర్ స్విష్ 'భయంకరమైన అగ్నిప్రమాదము'లో



















## దాని సంగతే అంత: స్విష్‌తో క్షౌరం చేసుకునే వారిని ఎవ్వరూ ఓడించ లేరు!

కాని అయనతో కలిసి పని చెయ్యవచ్చును (అయన రాబోయే సాహస కృత్యంలో)

mcm/ci/131 a te

నిర్ణయించ బడుతుంది! వారికి మనసులో కలిగిన భావాల్ని బట్టే ఆ(నాగార్జున కొండ) ద్వీపపు సౌందర్యం వాళ్ళ బుర్రలో నాటు కొంటుంది

ఈ యాత్రికులందరిలోనూ వొక్క భూషణరావుగారి కుటుంబమే నిశ్చలంగా కనిపిస్తోంది ఇంత స్థిరత్వం ఎలా కలిగిందో ఆ కుటుంబానికి శ్యామసుందరం ఆ కుటుంబ సభ్యులందర్నీ మరో మారు పరకాయించి చూసాడు

లాంచీ దక్షిణ విజయపురిలో అనుపుకు చేరింది వీళ్ల లాంచీ యేమైపోయిందో అని నిన్నటినుండి భయపడుతూ వున్న అధికారులు హాయిగా వూపిరి పీల్చుకున్నారు ఈ విహార యాత్రికులు స్కూటర్లను, కార్లను కాపలా కాస్తున్న అక్కడి కుర్రవాళ్ళు లాంచీ కని పించగానే గెంతసాగారు

లాంచీ నుండి నేలకు దిగడానికి పెద్ద త్రొక్కిసలాట జరిగింది ఎవరు చెబుతున్న వినిపించుకోకుండా ఎవరికివారు తామే ముందు దిగాలని కంగారు పడ్డారు!

అందరికంటె ఆఖరున శ్యామసుందరం, లక్ష్మీపతి దిగారు వాళ్లకు కొంచెం ముందుగా సుమిత్ర మిగిలిన ఆడపిల్లలు, వాళ్లకు ముందు మోహన్ బృందం దిగారు

ముందుకు వెళ్లిపోబోతున్న మోహన్, మురళీ, కుమార్, ప్రసాద్‌లు శ్యామసుందరం, లక్ష్మీపతి ఉన్నచోటుకువచ్చి "నిన్న మీరిద్దరూ మాకు చాలా సాయం చేసారు! మంచి కంపెనీ యిచ్చారు హైద్రాబాదులో తప్ప కుండా మళ్లీ కలవాలి మమ్మల్ని" అంటూ షేక్‌హేండ్ చేసి 'గుడ్ బై' చెప్పి రెండు స్కూటర్లమీద వెళ్లిపోయారు

అమ్మాయిలంతా టూరిస్టు బస్సులో వచ్చారు వీళ్లందరూ తిరిగి రావటం చూశాక ఆ కండక్టరు గుండె కుదుట ఎడింది నిన్న మీరు యిక్కడికి తిరిగి రాకపోవటం మూలాన్ని నాకు వో రోజు బస్సు అద్దె ఎక్కువైంది! ఈ ఎక్కువ డబ్బు మీరే కట్టాలి" అంటూ పేచీ పెట్టాడు! "తంతాం! జాగ్రత్త" అంటూ బస్సులో వచ్చిన విహారయాత్రికు లంతా గొడవ చేసాక ఇంక వూరుకొన్నాడు

టూరిస్టు బస్సు బయలుదేరే ముందు మాయ, కాంచన, కల్పన, సుమిత్రలు, శ్యామ సుందరం, లక్ష్మీపతుల దగ్గరకు వచ్చారు మాయ శ్యామసుందరంతో "నిన్న మీరు చేసిన సాయానికి చాలా కృతజ్ఞులం! మీ దయవల్లే మేమెళ్లా ఏ గొడవా లేకుండా

# అతకని అనుబంధాలు

అక్కడినుంచి సుఖంగా బయటపడ్డాం. హైద్రాబాదులో మిమ్మల్ని మళ్లీ కలుసు కోవాలని ఆశిస్తున్నాం మీకు వీలవుతుందా?" అని ప్రశ్నించింది

ప్రశ్న శ్యామసుందరాన్ని వేసినా ఆమె చూపు లక్ష్మీపతి వైపే వుంది!

"తప్పకుండాను!" అన్నాడుశ్యామసుందరం

తనవైపుచూసి శ్యామసుందరం ఏమన్నా మాట్లాడుతాడేమోనని ఆశించిన సుమిత్రకు ఆశాభంగమైంది!

తలవంచుకునే, 'వెళ్లివస్తామండీ' అందామె

"మళ్లీ తప్పకుండా కలుసుకుందాం!" అన్నాడు లక్ష్మీపతి అమ్మాయిలందర్నీ ఉద్దే

---

### ఇంటింటి చిట్కాలు

★ 'గ్రీజ్' మరకలు అయితే గుడ్డక్రింద అట్టముక్క వుంచి మరకపై వెన్న పులిమి, ఒకగంట ఆరిన తరువాత గోరువెచ్చని సబ్బు నీళ్లతో కడిగితే 'గ్రీజు' మరక వదిలిపోతుంది

★ క్రొత్తగా రంగువేసిన గదిలో రాత్రి పూట సగం కోసిన ఉల్లిపాయ పెడితే మరు నాటి ఉదయానికి రంగు యొక్క ఘాటు వాసన ఉండదు

★ ఆపిల్ ముక్కలు ఉడకబెట్టటానికి ముందు పంచదారవేసి నీళ్లు మరగపెట్టి ఆనక ఆపిల్ ముక్కలు వేస్తే ముక్కలు ముద్ద కాకుండా ఉడుకుతాయి

— ఎస్ వి రాణి

---

శించి! వాళ్ళు నవ్వుతూ చెయ్యూపి బస్సు ఎక్కారు బస్సుకదిలి పోయింది, హిల్‌కాలనీ వైపుగా ఆ టూరిస్టు బస్సువెళ్లేవరకుఆగిన భూషణరావుగారి కుటుంబం తమ కారులో కెక్కారు కారెక్కేముందు హైమవతి గారెందుకో శ్యామసుందరం వైపు చూసి వొక్క క్షణం కదలకుండా నిలబడిపోయింది మరుక్షణం తల విదుల్చుకుని కారులో కూర్చుని తలుపు దగ్గరకు వేసింది.

దుమ్ము రేపుతూ కారు రోడ్డుమీద ముందుకు సాగిపోయింది

శ్యామసుందరం అటేచూస్తూ నిలబడి పోయాడు

తన స్కూటరును ప్రక్క షెడ్డులోనుండి బయటకుతెచ్చి షెడ్‌వాచ్‌మెన్‌కు వోరూపాయి యిచ్చివచ్చిన లక్ష్మీపతి కదిలి వెళ్లిపోతున్న కారును, కదలకుండా నిలబడిన శ్యామ సుందరాన్ని చూసి అతనిదగ్గరగా వచ్చాడు

శ్యామసుందరం కంటిరెప్పలమీద లీలగా తడి కనిపిస్తోంది

"సుందరం! నిజం చెప్పు! నిన్న రాత్రి నువ్వునాకు చూపించిన తాయెత్తు అసలు తాయెత్తే కదూ?" లక్ష్మీపతి ఆర్ద్రంగా ప్రశ్నించాడు

"అవును పతీ! నిజమైందే! అబద్ధం చెప్పినందుకు క్షమించు!" శ్యామసుందరం గొంతు వొణుకుతోంది!

"అయితే స్కూటరెక్కు! తొందరగా వెళ్లి భూషణరావుగార్ని కలుసుకుందాం!" తొందరపెట్టాడు లక్ష్మీపతి

"ఒద్దు పతీ! ఒద్దు! నామాట విను! నన్నిలా అనాథగానే బ్రతకనియ్యి! భూషణ రావుగారూ హైమవతి గారూ ('హైమవతి గారూ' అంటూంటే అతని గొంతు గద్గద మైంది! తల్లిని తల్లి అని చెప్పుకోలేని తన యుడు అతను!) తమ గత జీవితాల్ని మరిచి పోయి క్రొత్త జీవితం ప్రారంభించారు నేనిప్పుడు క్రొత్తగా వెళ్లి, వాళ్ల జీవితాల్లో ప్రవేశించి, పాత గోరీలను పెళ్లగించలేను! నేనెవర్నో ఏమిటో ప్రతివారికి చెప్పుకుంటూ రావడం నాకూ వాళ్లకూ కూడా ఎంత కష్టంగా వుంటుందో ఆలోచించు!

ఈ ప్రపంచం వో మహాసముద్రం పతీ! మానవుల జీవితాలు యిందులోని ద్వీపాల లాంటివి! ఇవి తమతో పుట్టినప్పుడున్న సహజ అనుబంధాలను తప్ప కొత్తవాటిని అంత తొందరగా స్వీకరించలేవు! ఒకవేళ అతుకుదామని ప్రయత్నించినా అతుకు అతుకు లాగే వుంటుంది!

కనుక మమ్మల్నిలా విడివిడిగానే బ్రతక నియ్యి పతీ! అనాథనని చెప్పుకోవడంలో నాకివాళ కొత్తగా వచ్చే నామోషీయేమీ లేదు!

"ఒక్క విషయం మాత్రం నాకు చాలా ఆనందం కలిగిస్తోందిరా పతీ!" శ్యామ సుందరం కళ్లలో నీళ్ళు సుళ్లు తిరుగు తున్నాయి! గొంతు బొంగురుపోతోంది!

"పతీ! నేను అక్రమ సంతానాన్ని కాదురా! నా తల్లిదండ్రులు చాలా ఉత్తములు! నేను సక్రమ సంతానాన్నేరా పతీ! సక్రమ సంతానాన్ని!"

లక్ష్మీపతి భుజంమీద తల ఆన్చి ఏడుస్తు న్నాడు శ్యామసుందరం! (అయిపోయింది)

అంకితం: శ్రీ తిరుమలరాయునికి!

# నో వేకన్సీ

'శివ్రాజు'



అన్ని పనుల్లూ పూర్తిచేసేసినప్పటికీ, పెళ్ళికెదిగిన ఆడపిల్ల ఉద్యోగానికెదిగిన మొగ పిల్లడు ఖాళీగా కూర్చుంటే ఏదోలాగ వుంటుంది ఇంట్లో వాళ్ళకి

అప్పుడే కూరలసంచి వంటింట్లో గుమ్మరించినంచి మడత పెడుతున్న తమ్ముడ్నిచూసి—

"అన్నట్టారే శంకర్రావివాళ ఆ యింటి సంగతి కనుక్కొంటానన్నాడు వాడు వీధిలోకి బయలుదేరి పోయేలోగా అడిగొచ్చి" అన్నాడు అన్నయ్య

తమ్ముడు తల వూపాడు

తమ్ముడిపేరు నర్సింమూర్తి

అతను గుమ్మందాటిన అయిదు నిముషాల క్కాని సూపర్ బజార్‌లో డాల్డా వచ్చిందో లేదో కనుక్కొని రమ్మనాలని గుర్తుకురాలేదు మూర్తి తల్లికి సూపర్ బజారు శంకర్రావింటికి వెళ్ళే తోవలో వుంది

శంకర్రావింటికి వెళ్ళే తోవలో పూర్ణా మార్కెట్టుకూడా వుంది అక్కడ జనం నేల ఈనినట్టున్నారు ఎవరు వస్తున్నారో ఎవరు పోతున్నారో కూడా తెలియనంత గజిబిజిగా కిక్కిరిసి వున్నారు ఇసుక వేస్తే రాలు తుందేమోకాని బస్సులుపోవడానికి పిసరంతైనా ఖాళీలేదు జన్ను ముక్కని కోసుకుపోతున్న ఎత్తిలాగ ఆ జనాన్ని కోసుకొంటూ రాసుకొంటూ పోతున్నాయి బస్సులు

"హే ట్రాఫ్ టు దీజ్ డ్రైవర్స్" అనుకొన్నాడు మూర్తి.

' అది పునాదితాయి వేసిన నాడే ఎవరెవరో అడ్వాన్సులిచ్చేసి ప్రామిస్సులు పుచ్చేసుకొన్నారట అంచేత ప్రస్తుతం ఖాళీలులేవట కాని వాళ్లదే అక్కయ్య పాలెంలో ఒక ఇల్లుందిట ఆ ఇంట్లో వున్నతను ట్రాన్స్‌ఫర్ కోసం ప్రయత్నిస్తున్నాడట మరో ఏడెనిమిది నెలల్లో ఖాళీ అవచ్చేమో అంచేత మీక్కాని కావాలంటే చెప్పండి అడ్వాన్సిప్పుడు తీసుకొంటారేమోఅడుగుతాను'అన్నాడుశంకర్రావు

ఇంటినుంచి మళ్లీ బయలుదేరి సూపర్ బజార్ వేపువచ్చాడుమూర్తి డాల్డావచ్చింది

"బాగా వుందా ?"

"లేదండి" అన్నాడు చేతిలోవున్న ఖాళీలేనూనె డబ్బా చూసుకొంటూ

ఇంటికెళ్లి బాగా లేచ్చేసరికి "డాల్డా నో స్టాక్" స్వాగతం పలికింది

ఇంటికొచ్చి డబ్బా గూట్లో పెట్టేసి "తను ఇంక చెయ్యవలసిన పని ఏంటిటా ?" అని ఆలోచించాడు మూర్తి.

"ఆఁ బట్టలుతుక్కోవాలి" అనుకొన్నాడు లుంగి కట్టుకొని పెరట్లో కెళ్లబోతుంటే అతని వదినగారు కేకేసి —

"మూర్తి ఇరవై మూడో తారీఖు మెయిలుకి రిజర్వేషనిస్తున్నారేమో కనుక్కొని ఇస్తే చేయించిరూ " అన్నారు.

మళ్లీ బట్టలేసుకొన్నాడు మూర్తి చావులమదుం దగ్గర ట్వెంటీ దిగి స్టేషన్ వైపు నడకసాగించాడు అతనికి ఎడమచేతివైపు నాలుగునేవల్ ట్రక్కులు, మూడు కార్లు ఆగివున్నాయి వల్లకాటికి తోవలో సైన కూడా నేవల్ వాళ్లు అటూ ఇటూ తిరుగుతున్నారు లోపల నాలుగైదు చితులు మండుతున్నాయి ట్రక్కుల కివతలగా మూడు శవాలతో వాటి బంధువర్గం వున్నారు "ఇక్కడ కూడా ఖాళీలేదు కాబోలు" అనుకున్నాడు మూర్తి

స్టేషన్ చాలా రద్దీగా వుంది రిజర్వేషన్ కౌంటరు దగ్గర బట్టలు నలిగిపోతున్నాయి అంతమంది వూళ్లకి వెళ్లి అక్కడేం చేస్తారో బోధపడలేదు అతనికి కొంతసేపు శ్రమ పడిన మీదట "అతనికి కావల్సిన ట్రైన్కి

# నో వేకన్సీ

ఖాళీల్లేవని" చెప్పి మున్ఫైఅయిదో పేరుగా వెయిటింగ్ లిస్టులో నమోదు చేసుకొన్నారు.

మూర్తి భోజనం పూర్తిచేసి చెయ్యి కడుక్కొనే సరికి రెండున్నరయింది.

"... అన్నట్టు రత్నవత్త నిన్నొక సారెప్పుడు పంపమని కబురు పెట్టిందిరా" అన్నారు మూర్తి తల్లి.

"... ఏరా ? ఎక్కడా కనుపించటమే మానేసావ్ !...ఏంవిటంత తీరికలేని పని ? "

పరామర్శో, మందలింపో బోధపడలేదు. తీరా ఎందుకు రమ్మందో కనుక్కొంటే రేషన్ తేవడాని కని తేలింది.

"మా యింట నంచులు ఖాళీ లేవు. మీ యింట్లోవి తీసికెళ్లి తీసుకొచ్చి" పురమాయించింది రత్నవత్త.

సంచులు తీసుకొని బస్టాపులో నిలుచున్నాడు. విజిల్ మీద విజిల్ వేసుకొంటూ మూడు బస్సులు స్టాపులో ఆగకుండానే పారిపోయాయి. అవి మూడూ మహా రద్దీగా వున్నాయి. వెంట్రుకవాసంత పట్టుతో ఫుట్ బోర్డుమీద జనం గబ్బిలాల్లా వేళ్లాడుతున్నారు. ఏ పోలు పక్కనుంచైనా దగ్గరసా వెళ్లిందంటే పదిమందికి తక్కువ కాకుండా పచ్చడయ్యేటంత రద్దీగా వున్నారు.

కోటాకి వెళ్లటానికి రిక్షా శాంక్షన్ లేదు కాబట్టి నడిచే వెళ్లితెచ్చాడు మూర్తి.

"సుందరేశన్ గారిదగ్గర కెళ్ళావురా ?" అని అడిగారు మూర్తి తండ్రి, ఇంట్లోకి అడుగు పెడుతూవుంటే. క్రితం రోజు టైములేదని, ఆ రోజు వెళతానని చెప్పాడు.

"క్షణం తీరికలేదు, కాణీ రాబడి లేదని శాస్త్రం చెప్పినట్టు ఏంవిట్రా నీకంత తీరిక లేనిపని ?" అని దులిపేసే రాయన.

సుందరేశన్ చాలా మంది "తెలుగూ" పీపుల్ కంటేస్వచ్ఛమైనతెలుగుమాట్లాడతారు

"ఇప్పుడేం ఖాళీల్లేవండీ. ఎప్పుడైనా ఒకటి అర ఖాళీవొస్తే చైన్ రియాక్షన్ మీద ప్రమోషనిచ్చి, లోయస్టు పోజిబుల్ కేడర్‌లో అప్పాయింట్ చెయ్యాలి. లేకపోతే యూనియన్ వూరుకోదు... సర్లెండి... అప్లికేష నిచ్చేరు కద! చూద్దాం... ఏమైనా వస్తే కబురు పెడతాను" అన్నారాయన. మూర్తి ఇటువంటి మాట పాలుగేళ్లై వింటున్నాడు

చాలా నిరాశ కలిగింది మూర్తికి. తన బ్రతుకుమీద తనకే రోత పుట్టింది. "ఎన్నా

'కర్తి ఇలా పెరిగిపోతూ వుంటే—రోగాలు రాకమరేమిటి ?... డాక్టర్లకు కూడా అంతు చిక్కని రోగాలుపుడతాయి!... రాబోయేకాలం అంతా డాక్టర్లదే!' అన్నాడు ఎం.బి., బి.యస్. మూడో సంవత్సరం చదువుతున్న టి. సాయి సూర్య ప్రసాద్.

సినిమాలంటే యిష్టమే! హీరో కృష్ణ సినిమా అంటే ఎక్కువ యిష్టంట!

'కో ఎడ్యుకేషన్ చాలా అవసరం.

ఈనాటి విద్యార్థినీ విద్యార్థులకు చదువుమీద కంటే ఫాషన్‌లమీద మోజు ఎక్కువ అయింది!' అన్నాడు.

'డాక్టర్‌నై ... ప్రజాసేవచేసి... మంచి డాక్టర్ అనిపించుకోవాలన్నదే ఆశయం' అన్నాడు...

[గీతా ఫీచర్స్.]

ళ్లిలా ఈ వయస్సులో మరొకరిమీద ఆధారపడటం ? ఖాళీగా వుండకుండా ఎంత అనుక్షణం పనిచేస్తున్నా గుర్తింపులేదు. ఛీ... ఛీ...ఎందుకొచ్చిన బ్రతుకు ?" అనుకొన్నాడు.

నడిచి నడిచి బీచి చేరాడు. ఇల్లూ వాకిలీ లేని వాళ్లలాగా చాలా మంది చేరారక్కడ. ఇసుకనిండా జనం. లాన్స్‌లో జనం. బస్ పార్కుల్లో జనం. రోడ్డుమీద జనం. బీచి లోనూ కట్టుడాలే. సముద్రం లోనికి చొచ్చుకుపోయిన వారధి కనిపిస్తోంది. కొండపైవున్న సముద్రంలోకి ఏవేవో చాలా కట్టేరు. ఇటు పక్క ఆరేడు షిప్పులు వింత వింత వెలుగులతో అక్కడా అక్కడా కనిపిస్తున్నాయి. మొత్తం మీద చూపు పోరినంత మేర సముద్రం నిండుగాఖాళీ లేకుండావుంది.

తనంతలోకి పోయినా తిరిగి ఒడ్డున పారేస్తుంది, పద్దనుకున్నాడు. ఆశ చెడ్డది. బుర్రనిండా ఖాళీలేని ఆలోచనలతో ఇంటిదారి పట్టాడు మూర్తి. అతని కడుపులో పంది కొక్కులు పరిగెడుతున్నాయ్.

"ఏది ఎలాగున్నా కడుపుమాత్రం దాని టైమయ్యేసరికి ఖాళీ అవకుండా వుండదు కదా!"

## సామాన్యుని సణుగుడు

రైల్వేవాళ్ళు సమ్మెచేస్తే అష్టమ కష్టాలు పడ్డ దెవరూ? సమ్మెని వాళ్ళు చేసింతర్వాత దానిఫలితంగా గవర్నమెంట్ వాళ్ల ఖర్చు పెరిగిందట! నష్టంవచ్చిందీగా?! ఈ రెండిటినీ పూడ్చటానికి రైలుమీదెక్కి మరోవూరు కెళ్ళేవాడి ముక్కుపిండి నెత్తురు కక్కిస్తారా? యిదేనా న్యాయం! ధరలు పట్టుకోండి! పొదుపు చేయండి అంటూ పగలూ రాత్రి ప్రజల డబ్బు తగలేసి గొంతు చించుకుని అరచేదీ ఏలినవారే! మళ్ళీ తెల్లారేసరికి ధరలు పెంచేదీ ఏలినవారే?! పాలమ్ముకునేవాడు నీళ్ళు కలిపినా నెలాఖరుదాకా అరువుపోస్తాడు. కాస్త కనికరం చూపించి. నాలుగ్రోజులకోసారైనా యింత వెన్న రానిస్తాడు. కాని పాలప్రాజెక్టువాళ్ళు క్రొవ్వుతీసేసిన తెల్లనీళ్లకు నెలానెలా రేటు పెంచేస్తూంటారు—కరెంట్‌వాళ్ళు రోజుకి అరడజన్‌సార్లు దీపాలార్పేస్తూ ఉంటారు—కొన్ని ప్రాంతాల్లో కిరసనాయిలుబుడ్డి దీపాల్లాగైనా లైట్లు వెలిగేపాటి కరెంట్ కూడా యివ్వరు. కాని రేటు మాత్రం ఒక్కసారికి 31 నుంచి 39పైసలు అంటారు— దాందుంపతెగ— గవర్నమెంట్‌వాళ్ళు సగం అజ్మాయిషీ చేస్తేనే బస్సురేట్లు అదేవనిగా పెరుగుతున్నాయి—పైగా అన్నివేళలా ముష్టివాళ్ళు, జేబులు కొట్టేవాళ్ళు కాపురం ఉండే ప్లాట్‌ఫారం మీదికి పోడానికి అర్థరూపాయి పుచ్చుకునే రైల్వేవాళ్ళు— యేంచేశారయ్యా అంటే థర్డ్‌క్లాసుని సెకండ్ క్లాసన్నారు— ఇసుకతట్టకి పట్టుకుచ్చులు తగిలించారన్నట్లు— అదేచాలు మా స్టాటస్ పెరిగిందనుకున్నారు జనం కాని థర్డ్‌క్లాసుని సెకండ్ క్లాసంటూ దాని ధర కూడా అంతే చేసేశారా? యిదేనా? న్యాయం? రైలెక్కడం మానేయండి, బస్సెక్కడం మానెయ్యండి, పాలు త్రాగకండి! దీపాలెట్టుకోకండి—దేశం కోసం పొదుపు చేయండి! అంటారా! రూపాయికి పావలా చొప్పున గవర్నమెంటురేటు పెంచితే లేదుకాని, ఐదుపైసలువెక్కువడిగితే ఉరెట్టుకుపోతావేమయ్యా అని రిక్షావాడడిగితే? తప్పా? ఏమిటో సణుగుడు వినేదెవరు? పార్లమెంటు వాళ్లది. ప్రభుత్వం వాళ్లది. రైళ్లు వాళ్లవి... వాళ్లిష్టం! అంతేనా?





Printe l and Published by S NageswaiaRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gan lhinagar Vijayawa la 3 Editor S Radhakrishna

''నిత్య సుమంగళి'', మాంగల్య భాగ్యం'', ''చల్లని తల్లి'', ''ఉత్తమురాలు'', ''పూజా పుష్పాలు''; జెమినీ ద్విభాషా చిత్రం.

చూశారా! పస, పటిష్ఠత వుంటే చాలు చిత్రాలు వాటంతటవే వెదుక్కుంటూ వస్తాయి అని చెప్పడానికి జయంతిని మచ్చుకగా తీసుకోవడం అసమంజసమా?

## జన్మజన్మల బంధం

వెంకట రమణా పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించదలచిన ''జన్మ జన్మల బంధం'' షూటింగ్ ఆగస్టులో గాక అక్టోబరులో ప్రారంభం అవుతుంది అన్నారు నిర్మాత ఎల్. వి. స్వామి. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

పి. సి. రెడ్డి సహధర్మచారిణి శ్రీమతి లలిత రాసిన ''జన్మ జన్మల బంధం'' కథలో కృష్ణ ధరిస్తున్న వేషం విశిష్టమైనది. వెరైటీ వున్నది. రెండు జన్మలకు సంబంధించిన విచిత్రమైన పాత్ర అని దర్శకుడు చెప్పగా తెలిసింది.

ఇదే కథలో వాణిశ్రీ ధరిస్తున్న పాత్ర ఆమెకు మరొక కిరీటాన్ని తెచ్చిపెట్టే మరపురాని పాత్ర అని సినిమా ట్రీట్‌మెంట్ వ్రాసిన పి. చంద్రశేఖరరెడ్డి చెప్పారు. ఈ చిత్రానికి త్రిపురనేని మహారథి రచనను, మహదేవన్ సంగీతాన్ని, లక్ష్మణ గోరే ఛాయను, చలం కళను, మహేశ్వరరావు కూర్పును చేపట్టారు.

రెండవ నాయికగా సత్యప్రియ అనే కొత్త నటికి అవకాశం యివ్వబడింది. సహాయభూమికలను గుమ్మడి, రాజబాబు, మిక్కిలినేని, రమాప్రభ, పండరీబాయి మరియు సత్యనారాయణ ధరిస్తున్నారు.

## కృష్ణరాయ పిక్చర్స్

ఉత్తమాభిరుచులు, అభ్యుదయ భావాలు గల యువకులు నెలకొల్పిన సంస్థ కృష్ణరాయ పిక్చర్స్. ''వీడని బంధాలు'' అనే రసవత్తరమైన కథను ఎన్నుకొని, హైదరాబాద్ ప్రాంతంలో పూర్తిగా ఔట్‌డోర్‌లో భారీ ఎత్తున చిత్రీకరించనున్నారు. కొందరు అగ్రశ్రేణి నటీనటులతోపాటు కొత్త హీరోను, కొత్త హీరోయిన్‌ను పరిచయం చేసే ఈ చిత్రానికి అనిసెట్టి సుబ్బారావు, జి. విశ్వనాథ్, పి. సి. రెడ్డిగార్ల వద్ద దర్శకత్వ శాఖలో విశేషానుభవం గడించిన మధు, కె. ఎం. రెడ్డి దర్శకత్వం వహిస్తారు. సంగీతం: ఎస్. రాజేశ్వరరావు. కెమెరా: లక్ష్మన్ గోరే. కళ: రంగారావు. కూర్పు: ఎం.కె. సుందరం. ప్రొడక్షన్ కంట్రోలర్: డి. సుదర్శనం. నిర్వహణ: ఎల్. వి. రమణ. త్వరలో షూటింగ్ ప్రారంభమయ్యే ఈ విశిష్టమైన చిత్రాన్ని డి. సి. పాణి, ఎం. ఎస్‌సి. (అగ్రి.) సమర్పిస్తారు.

## పరివర్తన

సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న చిత్రానికి ''పరివర్తన'' అని పేరు యిడినట్టు నిర్మాత — దర్శకుడు హేమాంబరధరరావు చెప్పారు. ప్రసిద్ధ నవలా రచయిత్రి రాసిన ''అంతం చూసిన అసూయ'' కథ యీ చిత్రానికి మూలం. చిత్రానికి భమిడిపాటి



''అమ్మ మనసు''లో జయంతి

## సినిమా

(26వ పేజీ తరువాయి)

ఛాయను, బి. ఎన్. కృష్ణ కళను, బాబ్జీ కూర్పును, మహేంద్ర ప్రొడక్షన్ను నిర్వహిస్తున్నారు.

ఈ చిత్రంలో జమున, లక్ష్మి, కాంచన ముఖ్య తారాగణం. కృష్ణంరాజు కథా నాయకుడు. సహాయ పాత్రలను రాజబాబు, చంద్రమోహన్, ప్రభాకరరెడ్డి, పుష్పకుమారి పోషిస్తున్నారు. చిత్రం పది రీళ్లు పూర్తయినట్టు, విజయదశమి పర్వదినాన విడుదల చెయ్యదలచినట్టు దర్శకుడు హేమాంబరధరరావు చెప్పారు.

## ఆర్. కె. ప్రొడక్షన్స్!

కొత్తగా వెలసిన మరొక చిత్ర నిర్మాణ సంస్థ. నిర్మాత పేరు రామచంద్రరావు. వీరు పాలగుమ్మి పద్మరాజు రాసిన ''నల్ల రేగడి'' కథను కొన్నారు. ఆయన చేత ట్రీట్‌మెంటు వ్రాయించారు. మాటలను గోపీ సమకూరుస్తున్నాడు. ఈ చిత్రానికి జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు.

కృష్ణ, లక్ష్మి ప్రధాన జంటగా నటించే యీ ఈస్ట్‌మన్ కలర్ చిత్రానికి కె. హేమాంబరధరరావు దర్శకుడు.

## దాసరి తయారీలో మరో చిత్రం

ఏ చిత్రం తీసినా రక్తి కట్టించే వ్యక్తి దాసరి నారాయణరావు అనే పట్టాన్ని, అనతికాలంలో సంపాయించాడతడు అన్న నిజాన్ని ఎవ్వరూ కాదనలేరు.

గుంటూరు వాస్తవ్యుడైన తుమ్మా మద్రిరెడ్డి ఎంతో కాలంగా దాసరిచేత చిత్రం డైరెక్టు చేయించాలన్న తలంపుతో వుండి ఇప్పటికి ఆ తలపును కార్యరూపంలోకి తీసుకొచ్చారు. విజయ వేలాంగణి పిక్చర్స్ అనే సంస్థను స్థాపించి, పాలగుమ్మి పద్మరాజు వ్రాసిన ''మూడు పువ్వులు — ఆరు కాయలు'' అనే చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం చేసే బాధ్యత నప్పగించారు దాసరికి. పద్మరాజు మాటలు సమకూర్చే ఈ చిత్రానికి రాజేశ్వరరావు సంగీత నిర్దేశకుడు.

## శ్రీ విజయ వెంకటేశ్వరా పిక్చర్స్!

''జీవితరంగం'' చిత్రాన్ని అందించిన గుళ్లపల్లి నాగేశ్వరరావు నిర్మించే ''ప్రేమ కథ'' వర్ణ చిత్రం ఈ సంస్థ పేరిట వస్తుంది. ఈ చిత్రానికి రాజశ్రీ రచనను, సత్యం సంగీతాన్ని, బాలు మహేందర్ ఛాయను చేపట్టారు.

## మోహన్ నాయకత్వం

కథానాయకుడిగా పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్ శిక్షితుడు మోహన్ నటిస్తున్నాడు. సుపురద్రూపి. మంచి వాయిస్ వుంది. మరొక భాషలో గొప్పగా పేరు తెచ్చుకొన్నాడు. హీరోగా నిలబడగల యోగ్యత వున్నవాడు. ఇతడి ప్రియురాలిగా లక్ష్మి నటిస్తున్నది. ఒక ముఖ్య పాత్రను సుకుమారి పోషిస్తున్నది.

''ప్రేమ కథ'' అని పేరు పెట్టడాన్ని బట్టి యిది లైలా—మజ్ను, అనార్కలీ—సలీమ్ కోవకు చెందిన ప్రేమికుల జీవిత కథ అని వూహించడంలో తప్పులేదనుకొంటాను

—శ్రీనివాస్



''సౌభాగ్యవతి లో ఒక సన్నివేశం

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

# తువ్వాళ్ళు ఎంత చక్కటివంటే, మీరు వాటిని ఉపయోగించకుండా ఉండలేరు.



అలంకరణ సాధనాలు

DCM
TEXTILES

mcm/dcm/1112